

# నవ్వుతూ జీవించాలి

http://telugudevotionalswaranjali.blogspot.in

## తెలుగు భక్తి స్వరాంజలి

ఈ వెబ్‌సైట్‌లో భక్తిపాటలు, వీడియోలు,

ఈ-పుస్తకములు లింక్స్ ద్వారా ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకొనండి.



ఆధ్యాత్మిక భక్తి తత్వ జ్ఞానంప్రచారం ఈ **WEB SIGHTS** ద్వారా చేస్తున్నాము

**OUR VIDEOS,AUDIOS,e-BOOKS WEB SIGHTS** ల లోని **LINKS** ద్వారా **FREE** గా **DOWNLOAD** చేసికొనండి

**WWW.telugudevotionalswaranjali.blogspot.in**

స్వామి విద్యాప్రకాశానంద స్వాములవారి వారి ప్రవచనముల **WEB SIGHT LINK: WWW.gitamakarandam.blogspot.in**

స్వామి సుందర చైతన్యానందుల వారి ప్రవచనముల**WEB SIGHT LINK:**

**WWW.sundaravignanagrandalayam.blogspot.in**

**FOR HINDI BHAJANS, SANSKRIT SLOKAS & ASHTAKAMS & CHANTS WEB SIGHT LINK:**

**WWW.hindudevotionalswaranjali.blogspot.in**

**OUR YOUTUBE VIDEO CHANNELS :**

**www.youtube.com/user/ysreddy94hyd**

**www.youtube.com/user/shruthimandiramu**

**OUR e-BOOKS CHANNEL :**

**www.scribd.com/ysreddy94hyd**

**OUR E-mail ID: ysreddy94hyd@gmail.com** మీరు కూడా మీ వంతు ఆధ్యాత్మిక భక్తి తత్వ జ్ఞానప్రచారాన్ని మన **WEB SIGHTS** ను మీ **friends** కు మరియు బంధువులకు పంపడం ద్వారా చేయండి.



# నవ్వుతూ జీవించాలి


నవ్వుతూ జీవించాలి
స్వామి సుందర చైతన్యానంద
ప్రథమ ముద్రణము } జూలై 2012 సంవత్సరం 2000 కాపీలు.
(సర్వ స్వామ్యములు ట్రస్టువి)
ప్రతులకు :
సర్వజ్ఞ కల్చరల్ ట్రస్ట్,
సుందర చైతన్యాశ్రమం,
హైదరాబాద్ - 500 043.
☎: (08418) 255777,
(08418) 255355
డి.టి.పి. & కవర్ డిజైనింగ్
సుందర చైతన్యాశ్రమం
ముద్రణ:
శ్రీ లక్ష్మీగణపతి బైండింగ్ వర్క్స
కొవ్వూరు
☎: (08813) 231575


స్వామి సుందర చైతన్యానంద

# నవ్వుకు నాంది

మనిషి ఎప్పుడూ నవ్వలేడు. కాని, నవ్వ గలిగే శక్తిని ఎప్పుడూ కలిగి ఉన్నాడు. సదా ఆనందంగా మనిషి ఉండలేడు. కాని, ఆనందమే సదా తన స్వరూపంగా కలిగి ఉన్నాడు. నవ్వు కాలానికి సంబంధించింది కాదు. ఆనందం కాల పరిధిలో లేదు. అది వ్యక్తి పైనే కేంద్రీకరింపబడి ఉంది.

సూర్యోదయ మయ్యే కాలముంది. తరువులు పల్లవించే కాల ముంది. ఆకలయ్యే సమయ ముంది. నిద్రొచ్చే కాలముంది. నవ్వేందుకు, ఆనందంగా ఉండేందుకు కాల ముందా? సంతోష మనేది కాలాధీనమా? మనిషి ఎప్పుడు నవ్వుతాడో, ఏ కాలంలో నవ్వుతాడో ఎవరైనా చెప్పగలరా? చెప్పలేరు. అంటే దాని అర్థ మేమిటి? ఎప్పుడైనా నవ్వగలడు. అంతే కదూ? ఎప్పుడైనా నవ్వగలిగే శక్తి గల మానవుడు, ఎప్పుడూ నవ్వలేక పోవడానికి, ఎప్పుడో గాని నవ్వడానికి హేతు వేమిటి?

'నవ్వుతూ జీవించాలి' అనేది ఒక సందేశమా? ఎవరైనా ఏడుస్తూ బ్రతకాలని అనుకుంటున్నారా? అందరూ నవ్వుతూ జీవించాలి అనే భావిస్తున్నారు. ఆనందంగా బ్రతకాలనే అభిలషిస్తున్నారు. కాని, ఎందుకనో అలా జీవించలేక పోతున్నారు.

అలా జీవించలేక పోవడానికి ఏదో కారణం, లేదా కారణాలు ఉన్నాయి. అవరోధాలు ఉన్నాయి. ప్రతిబంధకాలు ఉన్నాయి. ఏమిటవి? అవి అర్థం కావాలి. వాటిని అధిగమించే దెలాగో తెలిసి రావాలి.

ఈ విషయాలను చర్చించడానికి గురుపూర్ణిమ సందర్భముగా హైదరాబాద్ - సుందర చైతన్యాశ్రమంలో నిర్వహించిన సదస్సులో నేను ప్రసంగించిన నాలుగు ప్రవచనముల సంకలనమే 'నవ్వుతూ జీవించాలి' అనే ఈ పొత్తము.

ఈ పుస్తకము మూర్తిలో చిన్నదే. స్ఫూర్తిని కలిగించడంలో దీప్తిమంతంగా ఉందని నా భావన. చదవండి. మీకే తెలుస్తుంది.

16-7-2012

స్వామి సుందర చైతన్యానంద

## ఇందులో......





# నవ్వుతూ జీవించాలి - I

ఆత్మబంధువులారా!

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వవ్యాపి అయిన పరమేశ్వరుడు సృష్టించిన పవిత్రమైన ఈ ప్రపంచంలో మన మందరము గాలిని పీలుస్తూ, నీటిని పానం చేస్తూ, ఆహారాన్ని భుజిస్తూ, కర్మలు ఆచరిస్తూ, అలసి నపుడు విశ్రమిస్తూ, శ్రమను పోగొట్టు కొనేందుకు నిద్రిస్తూ బ్రతుకుతున్నాం.

బ్రతుకైతే అందరికీ ఉంది. బ్రతకడం అందరికీ అర్థం కావడం లేదు. ఇక్కడే బ్రతుకులు బండబారి పోతున్నాయి. గుండెలు పగిలి పోతున్నాయి. కష్టాలు పెనవేసు కొంటున్నాయి. నవ్వులు దూరమై పోతున్నాయి.

***నవ్వడం యోగం కాదు***

***కళ అసలే కాదు***

నవ్వడం ఒక కళ అని కొందరు అభిప్రాయ పడుతున్నారు. నవ్వడం యోగ మని మరి కొందరు భావిస్తున్నారు. ఎవరి భావాలు వారివి. ఎవరి అభిప్రాయాలు వారివి. నా విషయాని కొస్తే, ఈ నిర్వచనములతో నేను ఏకీభవించలేక పోతున్నాను.

నవ్వడం కళే అయితే, నవ్వడానికి కూడా చాలా శ్రమించ వలసి వస్తుంది. ఒక శిల్పాన్ని చెక్కడానికి శిల్పకళాకారుడు ఎలా శ్రమిస్తాడో, ఒక నృత్యాన్ని అభినయించ డానికి నర్తకి ఎంతగా శ్రమిస్తుందో, రంగస్థలంపై ఒక పాత్రను అభినయిస్తూ పోషించడానికి నటుడు ఎలా పరిశ్రమిస్తాడో, అందమైన రచన చేయడానికి కవి భావాంబర విహారం చేయడమే గాక, అనుకూల సమయాల కోసం ఎలా నిరీక్షిస్తాడో, నవ్వడం కనుక కళే అయితే, నవ్వా లనుకొనే ప్రతి వ్యక్తి శ్రమించ వలసి వస్తుంది. అలాగే సమయాలకై నిరీక్షించ వలసి వస్తుంది.

నవ్వడం ఎలా కళ కాదో, అలాగే నవ్వడం యోగం కూడా కాదు. నవ్వడము యోగమైతే, అదీ బాధాకరమే. యోగాభ్యాసానికి మనము ఎంతగా కష్టపడ వలసి వస్తుందో నవ్వడానికి కూడా అంతగా కష్టపడ వలసి వస్తుంది. ఆసనాలు వేయడం అంత సులువా? ప్రాణాయామం చేయడం సులభమా? ధ్యానాచరణము అంత తేలికయా? ఆలోచించండి. శ్రమ ఏదైనా బాధాకరమే. యోగంలో కూడా శ్రమ ఉంది కనుక, ఆసనాలు రేపు వేద్దాంలే; ప్రాణాయామము రేపు చేద్దాంలే; ధ్యానం సాయంత్రం చేద్దాంలే అని ఎలా భావించి వాయిదాల పద్ధతిని అనుసరిస్తూ ఉంటామో, అలాగే నవ్వు కూడా యోగమైతే, రేపు నవ్వుదాములే, సాయంత్రము నవ్వుదాములే ఎందు కొచ్చిన శ్రమ అని నవ్వులను కూడా వాయిదా వేసుకుంటాం.

ఇక్కడ మరొక కోణం కూడా ఉంది. కళ అందరిలో అభివ్యక్తం కాదు. కొందరికే పరిమితం. యోగం కూడా అంతే. వికలాంగులు, రోగులు యోగానుష్ఠానం చేయలేరు. అలాంటి వారికి నవ్వు అనేది కుందేటి కొమ్మేనని సరిపెట్టు కోవాలా? ఆలోచించండి!

అందుకే అంటున్నాను; నవ్వు కళ కాదని, యోగం కూడా కాదని. అదేమిటి స్వామీజీ! నవ్వు యోగం కాకపోతే, ఏడుపు యోగ మవుతుందా? అప్పుడు ఏడుపు నేమనాలి? నవ్వు అనాలా? ఇంతకీ నవ్వేమిటి? ఏడుపేమిటి? ఆలోచిద్దాం కానివ్వండి. మనది జ్ఞానమార్గం. విచారమార్గం. **అతః విచారః కర్తవ్యః** – చేయదగింది విచారమే కనుక విచారిద్దాం, కానివ్వండి.

**నవ్వడం మనిషి స్వభావం**

నవ్వులు, ఏడుపులు తప్ప మన జీవితాలలో మరొక అనుభూతి లేదా? నవ్వులకు, ఏడుపులకు అతీతమైన అద్భుతమైన స్థితి ఒకటుంది. అదొక అనిర్వచనీయ మైన అలౌకిక స్థితి. అక్కడ ఏడుపు లుండవు. నవ్వుకు బదులుగా ఆనందం ఉంటుంది. అదే నిజమైన నవ్వు. సహజమైన నవ్వు. ఆనందము యొక్క వ్యక్త స్వరూపం.

అందుచేత, నవ్వడం కళ కాదు; నవ్వడం యోగం కాదు. నవ్వడం మనిషి స్వభావము. స్వరూపము. **రసో వైసః** – భగవంతుడు ఎలా ఆనంద స్వరూపుడో, మనిషి కూడా అలాగే ఆనంద స్వరూపుడు. శ్రుతి మందిరములో ఎన్నో ఉపనిషత్తులను, బ్రహ్మసూత్ర భాష్యమును శ్రవణం చేసిన మీకు ఈ విషయంలో సందేహ ముంటుందని నేను భావించడం లేదు.

సందేహం లేనపుడు, మీ నుండి కదిలే సందేశ మేమిటి? చెప్పండి. మనిషి సుఖ పడటానికి, ఆనందంగా ఉండటానికి, నవ్వుతూ జీవించడానికి ఏదీ అవసరం లేదు. తానొక్కడుంటే చాలు. తానే ఆనంద స్వరూపుడు. **నవ్వుకు అర్థం నవ్వేవాడే. నవ్వుకు అర్థం నవ్వేవాడే. నవ్వుకు అర్థం నవ్వేవాడే.**

ఈ విషయం అర్థమైతే, ఈ సత్యం బుద్ధిగా బుద్ధికి పడితే, వికసిత కుసుమం నుండి పరిమళం వెదజల్ల బడినట్లు, మనిషి నుండి ఆనందం సహజంగా వ్యక్త మవుతుంది. అంతర్యంలో ఆనందం ఉంటే, బాహ్యంలో నవ్వులు అప్రయత్నంగా, అనాయాసంగా వెదజల్ల బడుతూ ఉంటాయి.

**అర్థమైతేనే ఏదైనా**

బ్రతుకులో నవ్వులు దూరమయ్యాయి అంటే బుద్ధిలో ఆనందం లేదు అని అర్థం. దాని స్థానంలో మరేదో చేరిపోయిందని భావం. ప్రయత్నించి, విచారించి ఇవన్నీ మనం అర్థం చేసుకోవాలి. అర్థమైతే, ఆ తరువాత నదీ ప్రవాహానికి అడ్డు తొలగిస్తే, ప్రవాహ వేగము ఊపందు కున్నట్లు, బుద్ధి లోని ప్రతిబంధకాలను తొలగిస్తే బ్రతుకులలో ఏవీ మిగలవు, నవ్వులు తప్ప. ఈ జీవన సత్యాలను ఆకళింపు చేసుకొని, బ్రతుకు మార్గాన్ని



మరో కోణంలో త్రిప్పుకొని, నవ్వుతూ జీవించే దెలాగో అర్థం చేసుకోవ డానికి గురుపూర్ణిమ సందర్భముగా ఈ మూడు రోజులు శ్రుతి మందిరములో మనం ఉండా లనుకున్నాం.

'నవ్వుతూ జీవించాలి' అనే విషయాన్ని అర్థం చేసుకునే ముందు అసలు మనిషి నవ్వలేక పోవడానికి కారణ మేమిటి? అనేది అర్థం కావాలి. కారణాలు అర్థమై నపుడే కార్యాలలో కళ గోచరిస్తుంది.

తల ఉన్నవాడికే తలనొప్పి వస్తుంది. నొప్పి తల లోనే ఉంది. కాని, తలనొప్పి తలకు అర్థం కాదు. తన నొప్పినే అర్థం చేసుకోలేని తల, కడుపు నొప్పిని ఎలా అర్థం చేసుకుంటుంది? కాళ్ళ నొప్పుల్ని ఎలా అర్థం చేసుకుంటుంది? తలలో ఉన్నది తలకు అర్థం కాదు. నీకు అర్థం కావాలి. నాకు అర్థం కావాలి. మనందరికీ అర్థం కావాలి. ఎవరి తలలో ఏమి జరుగుతూ ఉందో అది వారికే అర్థం కావాలి.

మోకాళ్ళలో నొప్పి ఉండొచ్చు. అలాగని మోకాళ్ళు బాధ పడవు. మనస్సు బాధ పడుతుంది. ఏ బాధైనా మనస్సు లోనే ఉంటుంది. ఏ కష్టమైనా, దుఃఖమైనా మనస్సు లోనే ఉంటుంది.

తలనొప్పి తలకు సంబంధించినదే అయినా, తలకు ఎలా అర్థం కావడం లేదో, అలాగే మనస్సులో ఉండే కష్టం, బాధ, దుఃఖం మనస్సుకు అర్థం కావడం లేదు. తలకు తెలియని విషయాన్ని నువ్వు ఎలా తెలుసుకుంటున్నావో, మనస్సు లోని కష్టాన్ని మనస్సున్న నీవే అర్థం చేసుకోవాలి. అర్థం కానంత వరకు బ్రతుకులో ఏడుపులే ఉంటాయి. కళ్ళల్లో కన్నీళ్ళే కదుల్తూ ఉంటాయి. మనం ఈ ప్రపంచంలో జీవించే కొంత కాలం నవ్వుతూ ఆనందంగా బ్రతకాలే కాని, నవ్వుల్ని పారేసుకొని, ఆనందానికి దూరమై, ఏడుస్తూ బ్రతక డానికి అలవాటు పడకూడదు. ఆశలు పల్లవిస్తేనే నవ్వులు విరబూస్తాయి. నవ్వులు విరబూసి నపుడే ఆనందం ఫలరూప మైందని భావం.

Behold, we know not anything
I can but trust that good shall fall
At last - far off - at last to all,
And every winter change to spring,
So runs my dream.
But, what am I ?
An infant crying in the night,
An infant crying for the light;
And with no language but a cry.

'చూడండి, మన కేమీ తెలియదు. కాని, చిట్ట చివరికి, తుదకు అందరికీ మంచియే జరుగుతుందని, హేమంతము కనుమరుగై వసంతము విరబూస్తుందని నేను నమ్ముతున్నాను; కల గంటున్నాను.

అయితే, ఇంతకీ నేనేమిటి? చీకటిలో విలపించే శిశువును. వెలుగు కోసం పరితపించే శిశువును. ఏడుపు తప్ప మరో భాష నెరుగని శిశువును' అంటూ ఒక వైపు ఆవేదనను వ్యక్తం చేస్తూ, మరో వైపు ఆశాలతను పూయించాడు మహాకవి టెన్నిసన్.

ఆశలైతే అర్థ మవుతున్నాయి గాని, అవరోధా లెక్కడున్నాయో తెలిసి రావడం లేదు. ఏ ప్రతిబంధకాల కారణంగా బ్రతుకులో ప్రగతి దూరమైందో అది అర్థం కావాలి. అప్పుడే ఆశలు ఫలిస్తాయి. కలలు నిజా లవుతాయి. ఈ విషయంలో పాశ్చాత్యుల అవగాహనకు భిన్నంగా, మతాల అభిప్రాయాలకు అతీతంగా ఆర్షవిజ్ఞానం ఆవిష్కరింపబడి ఉంది. అదేమిటో కూడా చూద్దాం.

### నవ్వుకు అడ్డుగోడలు

సృష్టి రెండు రకాలు. (1) ఈశ్వర సృష్టి (2) జీవ సృష్టి. ఈశ్వర సృష్టి అంటే భగవంతుని చేత సృష్టింప బడిన సృష్టి అని అర్థము (**సృష్టం జగత్ - ఇదం జగత్ సృష్టం**). జీవసృష్టి అంటే, మనం మనస్సులో సృష్టించుకొనేది. ఈశ్వర సృష్టి ఒక్కటే. కనుక అందరికి ఒకే విధంగా అనుభవానికి అందుతుంది. కాని, జీవసృష్టి అలా కాదు. ఎవరు ఏ విధంగా సృష్టించు కుంటారో అదే వారి ప్రపంచము. కనుక జీవసృష్టి మనిషికి, మనిషికి భిన్నంగా ఉంటుంది.

ఈశ్వర సృష్టి బాధించదు. జీవసృష్టి బాధించకుండా ఉండలేదు. బాధల మధ్య మనిషి నవ్వలేడు. నవ్వుతూ జీవించాలి అంటే, బాధించే జీవసృష్టిని వీక్షించడం మాని, బాధించని ఈశ్వరసృష్టిని దర్శించడం అలవాటు చేసుకోవాలి.

ఉన్నది ఈశ్వరసృష్టి. అది సత్యమైంది. కాని అర్థం కాదు. సృష్టిలో ఏదీ పూర్ణంగా తెలిసి రాదు. విశ్వం ఎవరికి తెలుసు? శాస్త్రజ్ఞులే విస్తుపోతున్నారు. ఏది తెలిసినా, దానిని విశ్లేషిస్తే తెలియనివి అనేకము బయట పడతాయి. పరిశోధన లన్నీ ఇలాగే ఉన్నాయి. ఈ విషయంలో ఏ రంగమూ ప్రత్యేకము కాదు. 'Extracting one incomprehensible from another incomprehensible' - తెలియని దానిని వెలికి తీసే ప్రయత్నములో, పరిశోధనలో, మరొక తెలియని దానిని వెలికి తీయడమే అవుతున్న దని భౌతిక విజ్ఞాన శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ అభిప్రాయ పడ్డాడు.

ఈశ్వరసృష్టి సత్యమైంది. కాని, అర్థం కాదు. జీవసృష్టి కల్పిత మైనది. సత్యమైనది కాదు. అది అర్థమైనా ఉపయోగం లేదు.

ఆకాశంలో మేఘా లున్నాయి. అది ఈశ్వర సృష్టి. ఆకాశం లోని మేఘమండలములో ఏనుగులు, గుర్రాలు, నగరాలు ఉన్నట్లు కొందరు చూస్తున్నారు. అది జీవసృష్టి. అలాగే, ఎడారి ఈశ్వర సృష్టి. ఎడారిలో జలాశయమును దర్శించడం జీవసృష్టి.

వ్రాసుకొనే కలం ఖరీదు ఐదు వందల రూపాయలు. కాని, ఆ పెన్ను అమూల్య మంటాడు ఒక వ్యక్తి. లక్ష రూపాయ లిచ్చినా దానిని ఇవ్వను అంటాడు. దానికి కారణం



వ్యక్తిగతం అంటాడు. అది పెళ్ళి సమయంలో తన భార్య ప్రేమతో కొనిపెట్టింది కనుక అది అమూల్య మంటాడు. పైపెచ్చు, ఆ కలం కారణం గానే తాను గొప్ప కవితా ఖండికలను రచించ గలిగాను అంటాడు. ఇదంతా జీవసృష్టి.

### ఉన్నది చూస్తున్నామా?

### మనస్సులో ఉన్నది చూస్తున్నామా?

ఈశ్వరుడు సృష్టించిన ప్రపంచంలో మనం ఉన్నాం. కాని, అక్కడ మనం జీవించడం లేదు. మన మనస్సులో ఉన్న ప్రపంచంలో మనం బ్రతుకుతున్నాం. అంటే, సత్యానికి దూరంగా, మన మనస్సులో మనం కల్పించుకున్న అసత్య ప్రపంచంలో మనుగడను సాగిస్తున్నాం. అదెలాగో మొదట అర్థం చేసుకుందాం.

మనకు చూచేందుకు కళ్ళున్నాయి. కళ్ళు చూచిన వాటిని అర్థం చేసుకొనేందుకు కళ్ళ వెనుక మనస్సు ఉంది. మనం మేలుకొని చూస్తున్నాము. మన ముందున్న దృశ్యాలు మన కంట పడతాయి. అవి అలా కంట పడకుండా నివారించడం సాధ్యం కాదు.

అలాగే దృశ్యశబ్దాదు లన్నీ. 'సార్! నమస్తే!' అని ఒక వ్యక్తి వెనుక నుండి పలుకుతాడు. శబ్దం చెవిని పడుతుంది. ఆ శబ్దాన్ని మనస్సు గుర్తిస్తుంది. వెను దిరుగుతాం. నమస్కరించిన వ్యక్తి రూపం కనిపిస్తుంది. అతని అభివాదానికి ప్రతిగా మనం నమస్కరిస్తాం. అలాగే వాసనలు ముక్కుకు, రుచులు నాలుకకు, స్పర్శలు చర్మానికి అందుతూ ఉంటాయి. ఈ విధంగా విషయ ప్రపంచముతో మనకు సంబంధాలు ఏర్పడుతూ ఉంటాయి.

సంబంధాలు లేకుండా జీవించడం ఎవ్వరికీ సాధ్యం కాదు. ఈశ్వర సృష్టిలో ఎవ్వరూ ఒంటరివారు కారు; ఒంటరిగా లేరు. మనుషులు మన ప్రక్కన ఒక సమయంలో లేక పోవచ్చు కలత పెట్టడానికి. కనీసం ఈగలన్నా ఉంటాయి. దోమలన్నా ఉంటాయి. వాతావరణ కాలుష్యం ఉంటుంది. శబ్ద కాలుష్య ముంటుంది. మైకు లుంటాయి. ఏం చేద్దాం? ఇవన్నీ విషయాలే. సంబంధాలే. అనుభవాలే. అనుభవాలను పంచే ప్రపంచానికి దూరంగా వెళ్ళ లేము. ప్రపంచాన్ని గుర్తించే మనస్సును దూరం చేసుకోలేము. అందుచేత, సంబంధా లనేవి ప్రతి ఒక్కరికి అనివార్యాలే.

### ఇష్టాయిష్టాలు

ఈశ్వర సృష్టిలో విషయా లున్నాయి. వ్యక్తు లున్నారు. సన్నివేశా లున్నాయి. వాటిలో కొన్ని మనకు ఇష్టం. కొన్ని మనకు కష్టం. కొందరంటే మనకు ఇష్టం. కొందరంటే అయిష్టం. ఇష్ట ముండటం రాగం. అయిష్ట ముండటం ద్వేషం.

వీటిలో వ్యక్తులు, విషయాలు, సన్నివేశాలు ఈశ్వర సృష్టిలో ఉన్నాయి. ఇష్టాలు, అయిష్టాలు జీవసృష్టిలో ఉన్నాయి. బాహ్య జగత్తులో వ్యక్తులు, విషయాలే ఉన్నాయి. వాటిలో ఇష్టాయిష్టాలు లేవు.

ఏ వస్తువు ఇష్టం కాదు. ఏ వస్తువు అయిష్టం కాదు. ఈ వస్తువు ఇష్ట వస్తువు అని చెప్పలేము. అదే కనుక ఇష్ట వస్తువైతే, అది అందరికీ ఇష్టంగా ఉండాలి. అందరికీ ప్రియ వస్తువుగా ఉండాలి. కొందరికి ఇష్టము గాను, మరి కొందరికి అయిష్టము గాను ఉంది అంటే, ఆ వస్తువు వస్తువుగా ఉన్నదే గాని, దానిలో ఇష్టమూ లేదు; అయిష్టమూ లేదు అని అర్థం.

అలాగే వ్యక్తు లైనా, సన్నివేశాలైనా. అందరూ అందరికీ ఇష్టులు కాలేరు. అలాగని అయిష్టులూ కాలేరు. వ్యక్తి వ్యక్తియే. ఇష్ట వ్యక్తి, అయిష్ట వ్యక్తిగా లేదు. అలాగే ఏ సన్నివేశమైనా.

ఇష్టాయిష్టా లనేవి చూచే వ్యక్తి మనస్సులో ఉన్నాయి. జీవసృష్టిలో ఉన్నాయి. ఈ కారణం గానే వ్యక్తులలో ఇష్టాయిష్టాలు మారుతూ ఉన్నాయి.

దేనిని చూచినా తప్పు లేదు. దేని లోనూ దోషము లేదు. కనిపించే వాటిలో దోషాన్ని దర్శించి నపుడే ద్వేషం పుట్టు కొస్తుంది. ద్వేషం ఎవరి కిష్టం? అయినా ద్వేషించకుండా మనుగడను సాగించడం ఎవరికి సాధ్యం? అందుకే ద్వేషం మన వద్ద ఉంది. జీవసృష్టిలో ఉంది. ద్వేష బుద్ధి ఎలా నవ్వుతుంది? ఏ మనిషైనా నవ్వలేక పోవడానికి, నవ్వుతూ ఆనందంగా జీవించలేక పోవడానికి ఈశ్వరుడు సృష్టించిన ప్రపంచం కారణం కానే కాదు. మనిషి లోని ద్వేషాలు, దోషాలే కారణం. జీవసృష్టి లోని రాగద్వేషాలే నవ్వుకు అడ్డుగోడలు. ఆలోచించండి.

**ఇష్టాయిష్టాల ప్రపంచం**

విషయ విషయీ సంబంధాలలో అయిష్టా లెందు కుంటాయి? దోషా లెందుకని దర్శనీయ మవుతాయి? ద్వేషా లెందుకు బుద్ధిని కలత పెడతాయి? ఇది బాగలేదు. అది వికారంగా ఉంది. అతని ప్రవర్తన హేయంగా ఉంది. ఆవిడ ప్రవర్తన ప్రశ్నార్థకంగా ఉంది. ఇవి అయిష్టాలు. విషయ ప్రపంచంపై మనం లేవనెత్తే అభియోగాలు.

అవి బాగలేవు. వారు బాగలేరు. అంతేకదా! ఉండనివ్వండి. ఏమైంది? అంతమాత్రం చేత వాటిని పట్టించుకొని మన మనస్సును ఎందుకు పాడు చేసుకోవాలి? దృశ్యాల లోని వికారాలు ద్రష్టను వికృతంగా ఎందుకు మార్చాలి? ఇది ఆలోచించ దగిన విషయం.

ప్రపంచంలో ఏదైనా సరే, అది ఎలా ఉందో నీకు తెలుస్తూ ఉండొచ్చు. ఎవరు ఎలా ఉన్నారో నీకు గోచరిస్తూ ఉండొచ్చు. అది ఎందుకలా ఉందో, వారు ఎందుకలా ఉన్నారో నీకు తెలుసా? తెలియదు. మరి. తెలియని దాని విషయంలో, తెలియని వ్యక్తి విషయంలో నీకు, నాకు అయిష్ట మెలా ఏర్పడుతుంది?

తెలియని విషయంలో అయిష్టతకు అవకాశం లేదు. ఒకవేళ తెలిసింది అంటే, అవి అలా ఉండటానికి ఏది కారణమో అది తెలిసింది అని భావము. కారణము ఉండి, కార్యాలు అలా ఉండే టప్పుడు వాటిని ప్రశ్నించడానికి నీకు, నాకు అధికార మెక్కడుంది? ఆలోచించండి.



**అన్నీ ఆరోపితాలే**

విషయ ప్రపంచంలో మనం ఏది చూచినా, ఎవరిని చూచినా, అది మనకు అర్థం కావాలి. అప్పుడే సంబంధాలు సవ్యంగా సాగుతాయి. కాని, విచిత్ర మేమిటంటే ఏదీ మనకు పూర్తిగా తెలిసి రాదు. ఉన్నది కొంత అర్థ మవుతుంది. కొంత అర్థం కాదు. ఏదైతే అర్థం కాదో, దాని స్థానంలో మనలో ఉన్నదే అక్కడ ఉన్నట్లు అర్థ మవుతుంది.

తెలిసిన ఒక వ్యక్తి దారిలో ఎదురు పడతాడు. తెలిసిన వ్యక్తి కావడం చేత అపరిచితుడు లాగా తటస్థంగా, ముభావంగా తొలగి పోలేడు. ఏదో ఒకటి మాట్లాడాలి. ఇదే సంబంధం. సంబంధమైతే బాగుంది. సంభాషణకు వస్తు వేది? విషయ మేముంది? అందుకని, బాగున్నారా? అని నవ్వుతూ ప్రశ్నిస్తాడు. అది ప్రశ్నే కావచ్చు. వాస్తవానికి అది పలకరింపే గాని, కలవరపడ దగింది ఏమీ కాదు.

సామాన్యమైన ఈ పలకరింపును వికృతంగా మార్చుకొని ఆవేదన చెందవచ్చు. నేను బాగానే ఉన్నాను కదా! ప్రత్యేకించి బాగున్నారా అని నన్ను ఎందుకు ప్రశ్నించాడు? నాలో బాగలేనిది అతనికి ఏమి కనిపించింది? అని ఆంతర్యంలో తలపోసుకోవచ్చు.

ఇప్పుడు చూడండి. ఎదుటి వ్యక్తి పలకరింపులో మనకు కొంత అర్థమైంది, కొంత అర్థం కాలేదు. బాగున్నారా? అనే కుశల ప్రశ్న అర్థమైంది. ఎందుకలా అడిగాడు అని మనల్ని మనం ప్రశ్నించుకొనిన స్వగతానికి సమాధాన మేమిటో అర్థం కాలేదు. ఇలాంటి సందర్భాలలో మనలో ఏదుంటే, అదే ఆ వ్యక్తిలో ఉన్నట్లు అర్థ మవుతుంది.

వారం రోజుల క్రితం మా మామ గారి ఆస్తి నాకు సంక్రమించిన విషయం ఇతనికి తెలిసి పోయిందా? నన్నేమైనా అప్పు అడుగుతాడా? ఎందుకైనా ముందు జాగ్రత్త మంచిది అని నిర్ణయించుకొని, బాగున్నారా? అని అతడు అడిగిన కుశల ప్రశ్నకు 'ఆఁ ఏం బాగు లెండి. అన్నీ బాధలే. ఆర్థిక ఇబ్బందులతో సతమత మవుతున్నా!' అని సమాధానం చెప్పి ముందుకు వెళ్లాడు.

ఎక్కడ ముందు కెళ్ళేది? అడుగు ముందుకు పడుతూ ఉంటే, ఆలోచన వెనక్కి లాగుతూ ఉంటుంది. నేను అనవసరంగా అతనితో అబద్ధం చెప్పాను. అతడు నిజం గానే కుశల మడిగాడేమో? నేనే అనవసరంగా ఏదో ఏదో ఆపాదించుకొని అబద్ధం చెప్పేశాను. చూశారా? ఆంతర్యంలో అలజడి ఆరంభమైంది. ఘర్షణ ప్రారంభమైంది. అలజడులతో, ఘర్షణలతో కలత చెందే మనస్సులు గల మనుషులు మనసారా నవ్వగలరా? ఆలోచించండి.

**సత్యాసత్యాలు**

ఉన్న దానిని ఉన్నట్లు అర్థం చేసుకోవాలి. ఇదే సత్యబుద్ధి. ఏది ఉంటే అది, ఉన్న దున్నట్లు అర్థం కావడం సత్యబుద్ధి (**తస్మిన్ తద్బుద్ధిః**). సత్య బుద్ధి కలత పెట్టదు. కలత పడదు. నవ్వులను బ్రతుకులో దూరం చేయదు.

కాని, ఎవరు ఎలా ఉన్నారో అర్థం కాదు. ఏది ఎందు కున్నదో తెలిసిరాదు. కొందరి విషయంలో వారిలో ఉన్నది కొంత, మనలో ఉన్నది కొంత కలిసి అర్థ మవుతుంది. మరి కొందరి విషయంలో వారిలో ఉన్నది అసలే మన బుర్ర కెక్కదు. అంతా మనలో ఉన్నదే వాళ్ళలో ఉన్నట్లు అర్థ మవుతుంది. ఇక్కడ ఉన్నది అర్థం కావడం లేదు. లేనిది ఉన్నట్లు అర్థ మవుతూ ఉంది. ఇది సత్య బుద్ధి కాదు. అసత్య బుద్ధి (**అతస్మిన్ తద్బుద్ధిః**). అది కాని దాని యందు అది అనే బుద్ధి. దీనినే వేదాంత పరిభాషలో అధ్యాస అంటారు. ఇక్కడే సంబంధాలు గాడి తప్పి అపార్థాలకు, అనర్థాలకు నాంది పలుకుతాయి.

కనుకనే, ఎప్పుడు ఎవరు ఎలా ప్రవర్తిస్తారో సంవత్సరాలు కలిసి బ్రతికినా అర్థం కాదు. లేనివి చూస్తాం. సమస్యలు సృష్టించుకుంటాం. మనస్సును పాడు చేసుకుంటాం. నవ్వులు పారేసుకుంటాం. ఈ విధమైన అస్తవ్యస్త జీవనానికి కారణం ఊహాతీత మేమీ కాదు. ఉన్న ఈశ్వరసృష్టిని ఉన్నట్లు చూడలేక పోవటము, దాని స్థానే జీవసృష్టితో లేని దానిని ఉన్నట్లు చూడటమే కారణము అని ఇంతవరకు అర్థం చేసుకున్నాం.

ఈశ్వర సృష్టిలో ఉన్నది ఉన్నట్లు అర్థ మవుతుంది. జీవసృష్టిలో ఉన్నది ఉన్నట్లు అర్థం కాదు. పైగా, మనలో ఏది ఉంటే అదే అక్కడ ఉన్నట్లు అర్థ మవుతుంది. మన అనుభవాన్ని మించి ఏదీ అర్థం కాదు.

### ఇంధనం కారిపోయింది

పట్టణంలో జీవిస్తున్న ఒక కోటీశ్వరుడు వేసవి సెలవుల్లో, బాల్యావస్థలో ఉన్న తన కుమారునికి పల్లె జీవనాన్ని చూపించాలని అభిప్రాయపడి, బెంజి కారులో పిల్లవాణ్ణి కూర్చోబెట్టుకొని తాతయ్య ఊరు చూద్దువు రా! అని చెప్పి తన స్వగ్రామానికి తీసుకొని వచ్చాడు. పల్లె జీవనం క్రొత్త కావడం చేత ఆ పిల్లవాడికి అక్కడ అన్నీ క్రొత్త విషయాలు గానే ఉన్నాయి.

ఒకనాడు పిల్లవాడు ఇంటి ముందు నిలబడి ఉన్నాడు. ఆ వైపు నుంచి గుఱ్ఱపుబండి ఒకటి వస్తూ ఉంది. దానిని పిల్లవాడు ఆశ్చర్యంగా చూస్తున్నాడు. ఇంతవరకు ఆ బాలుడు గుఱ్ఱమును గాని, గుఱ్ఱపు బండిని గాని చూడలేదు.

అలా వస్తున్న గుఱ్ఱపు బండి బాలుడున్న ఇంటికి ఎదురింటి ముందు ఆగింది. బండివాడు దిగి ఆ ఇంటి లోకి వెళ్ళాడు. కొంతసేపు తరువాత అతడు ఇంటిలో నుండి బయటకు వచ్చి, మళ్ళీ బండి నెక్కి, పగ్గాలు చేత బట్టుకొని బండిని నడపడానికి సిద్ధ మయ్యాడు. ఈ లోగా బాలుడు 'అంకుల్ . . . అంకుల్' అంటూ గుఱ్ఱపుబండిని సమీపించాడు. బండివాడు బండిని ఆపి, 'ఏం బాబూ!' అని బాలుణ్ణి పలకరించాడు.

'అంకుల్! ఇప్పుడు మీరు ఎక్కడి కెళ్తున్నారు?' అని ప్రశ్నించాడు ఆ బాలుడు. 'నేను ప్రక్క గ్రామానికి వెళ్తున్నాను బాబూ!' అని బండివాడు సమాధాన మిచ్చాడు. 'అంటే, చాలా దూరమా, అంకుల్?' అని తిరిగి ప్రశ్నించాడు బాలుడు. 'బాబూ! ఎందుకలా ప్రశ్నిస్తున్నావు?' అని తిరిగి ప్రశ్నించాడు బండివాడు.



'ఏం లేదు అంకుల్, మీరు లోపలి కెళ్ళినప్పుడు మీ వాహనం నుండి పెట్రోలు చాలా కారి పోయింది. మీరు చూసుకోకుండా పోతే, మధ్యలో ఇబ్బంది పడతారని చెప్పాను. అంతే. ఒకసారి మా వాహనం కూడా ఇంధనం అయిపోయి మధ్యలో ఆగి పోయింది. అందుకని చెప్పాను' అన్నాడు బాలుడు.

అదేమిటా అని అర్థం గాక బండివాడు గుఱ్ఱం క్రింద చూస్తే, భూమి అంతా తడిసి పోయి ఉంది. గుఱ్ఱం ఎక్కువ గానే కార్చినట్లుంది. 'అలాగే బాబూ! పెట్రోలు నింపుకొని పోతాలే' అని పలికి నవ్వుకుంటూ వెళ్ళిన బండివాడు ఊరు దాటగానే గుఱ్ఱాన్ని నదిలో దింపి కడుపారా నీరు త్రాగించి, ఆ తరువాత బండిని నడుపుకుంటూ వెళ్ళాడు.

ఏం చేద్దాం! బాలుడు తన అనుభవాన్ని మించి చూడలేదు. బాలుడే కాదు. అందరమూ అంతే. జీవసృష్టి లోనే జీవితాలు ముగిసి పోతున్నాయి.

### మార్పు బాధాకరం
### మారడం ముదావహం

ఈ ప్రపంచంలో ఏది ఎలా ఉన్నా, ఎవరు ఎలా ఉన్నా, అవి అలా ఉండటం వెనుక కారణా లున్నాయి. అందుకని ఏవి ఎలా ఉన్నవో అలాగే ఉంటాయి. ఎవరు ఎలా ఉన్నారో అలాగే ఉంటారు. మరోలా ఉండాలనుకున్నా ఉండలేరు. అలా ఉండటం వెనుక ధర్మా లున్నాయి. అదే నియతి. ఇది అర్థం చేసుకో దగిందే గాని మార్చ దగింది కాదు.

అర్థం చేసుకుంటే నవ్వులు ఉంటాయి. మార్చేందుకు ప్రయత్నిస్తే, నవ్వులు దూర మవుతాయి. మార్పుకు ప్రయత్నించడం తప్పు కాదు; ఆ ప్రయత్నంలో దోషం లేదు. మార లేదని దుఃఖ పడితే మాత్రం లాభం లేదు. పైగా, అన్నీ నష్టాలే; కష్టాలే. ఇక్కడే నవ్వుల స్థానంలో ఏడుపులు అందల మెక్కుతున్నాయి. కనుకనే, గీతలో భగవానుడు,

**తస్మాత్ అపరిహార్యేర్థే న త్వం శోచితు మర్హసి**

'అర్జునా! పరిహారం లేని వాటి విషయంలో దుఃఖించడం తగదు' అన్నాడు. ఎవరు ఎలా ఉన్నారో, వాళ్ళను అలాగే అంగీకరిస్తే, మన జీవితాలలో నవ్వులు దూరం కావు. ప్రపంచాన్ని ఉన్న దున్నట్లు చూడ గలిగితే, నువ్వు ఈశ్వరసృష్టిని దర్శిస్తున్నావు. ఈశ్వరుడు, ఈశ్వరసృష్టి రెండు కావు. ఈశ్వరసృష్టి ఈశ్వరుని కన్నా వేరుగా లేదు. ఇదే ఈశ్వర దర్శనం. మంగళప్రదమైన దర్శనం. ఆనంద దాయకమైన దర్శనం.

ఈశ్వరసృష్టిని దర్శించడం మానేసి, జీవసృష్టిని కల్పించుకొని దర్శిస్తే, బ్రతుకే అస్తవ్యస్త మవుతుంది. దుఃఖమయ మవుతుంది. జన్మలకు కారణ మవుతుంది.

### నీకు సమస్య లేదు
### నీవే నీకు సమస్య

ఈశ్వరసృష్టిలో ఏది ఎలా ఉండాలో అలా ఉంటుంది. ఎవరు ఎలా ఉండాలో అలా ఉంటారు. ఎవరూ నీకు సమస్య కాదు. నువ్వే నీకు సమస్యగా మారి పోతున్నావు. సంసారంలో

పడి మునిగి పోతున్నావు. సంసార సాగరం (భవ సాగరం) ఇంతవరకు ఎవ్వరినీ ముంచలేదు. నిన్ను కూడా ముంచ లేదు. నువ్వే ఆ సాగరంలో మునిగి పోతున్నావు. ప్రపంచం ఎవ్వరినీ కష్టాల కడలిలో ముంచ లేదు. మన అజ్ఞానం కారణంగా మనమే మునిగి పోతున్నాము.

కొందరు మిత్రులు తీర్థాటనకు బయలుదేరి వెళ్ళారు. అనేక పుణ్య ప్రదేశాలను, తీర్థక్షేత్రాలను సందర్శించుకొని చివరగా కాశీ నగరానికి చేరారు. కాశీక్షేత్రంలో పవిత్రమైన గంగానదిలో మునక వేసి పాప ప్రక్షాళనం గావించు కోవాలని భావించారు.

ఒకనాడు అందరు భక్తితో వెళ్ళి గంగలో దిగి పుణ్య స్నాన మాచరిస్తూ ఉన్నారు. ఇంతలో వారిలో ఒక వ్యక్తి గంగా ప్రవాహంలో కొట్టుకు పోతున్నాడు. అతనికి ఈత రాదు. ఆ విషయం మిత్రులకు కూడా తెలియదు. అంతే కాదు. అందరూ ఎవరికి వారు ఈదగలరే గాని మునిగి పోయే వ్యక్తిని రక్షించ గలిగేటంత ఈత వీరిలో ఎవరికీ రాదు. ఏమి చెయ్యాలో అర్థం కాలేదు. ఈ లోగా మునిగి పోయిన వ్యక్తి పైకి తేలి, నిశ్చలంగా ప్రవాహంలో దొర్లి పోతున్నాడు.

అందరూ గట్టుకు చేరారు. దేనికో ప్రయత్నిస్తే, మరేదో ఎదురైనట్లు, పుణ్యస్నానం చేయాలని గంగలో దిగి, తమ మిత్రుణ్ణే శాశ్వతంగా పోగొట్టు కున్నారు యాత్రికులు. ఊహించని ఈ పరిణామానికి క్రుంగిపోతూ, బిగ్గరగా రోదిస్తూ తీరాన కూలబడ్డారు.

వారి దుఃఖానికి చలించిన గంగమ్మ తల్లి దర్శన మిచ్చింది. వారిని ఊరడించే పలుకులు పలికింది. అయినా వారి దుఃఖం ఆగలేదు. కన్నీళ్ళు కారుతూనే ఉన్నాయి. దుఃఖిస్తున్న ఆ యాత్రికులు గంగాదేవిని ప్రశ్నించారు.

'తల్లీ! నీలో పుణ్యస్నాన మాచరించి పవిత్రులం కావాలని వచ్చాం. ఇంత దూరం శ్రమించి మేము వస్తే, మాలో ఒకణ్ణి నీవు బలి తీసుకుంటావా? ఇది నీకు ధర్మమా? ఇదేనా నీ మాతృ హృదయం?' అని ప్రశ్నించారు.

'నాయనలారా! కాస్త శాంతించండి. సావధానంతో ఆలకించండి. నేను అతణ్ణి బలి తీసుకోవడ మేమిటి? అతడే బలై పోయాడు. ఇందులో నా ప్రమేయ మెక్కడుంది?' అన్నది గంగమ్మ.

**'అదేమిటి తల్లీ!** అలా మాట్లాడుతావు? అతడు మునిగింది నీలో కాదా! కొట్టుకు **పోయింది నీలో కాదా! ప్రాణాలు** విడిచింది నీలో కాదా? నువ్వు కాదా అతణ్ణి ముంచింది? **నువ్వు కాదా మా కొంప** ముంచింది?' అని స్వరం పెంచారు.

**'బిడ్డలారా! అమాయకంగా** మాట్లాడు తున్నారు. నేను అతణ్ణి ముంచలేదు. అతడు **మునిగింది** నా లోనే. కాని, అక్కడ నా ప్రమేయ మేమీ లేదు. అంతా అతనిదే. మిమ్మల్ని **నేను ముంచానా? అతణ్ణి మాత్రమే** ముంచడానికి అతను నాకు శత్రువా? ఆలోచించండి. **అర్థం గాక అపనిందలు** వేస్తున్నారు. అతడి ప్రాణాన్ని హరించింది అతని అజ్ఞానమే గాని **నేను కాదు. నియతి శోభిస్తున్న** ఈ ప్రపంచంలో తెలిసి చేసినా, తెలియక చేసినా, చేసిన **దానికి మూల్యం చెల్లించుకోక తప్పదు** కదా!'



'ఈత తెలిసిన మీరు మునగ లేదు. ఈత తెలియని కారణంగా అతడు మునిగి పోయాడు. లోకం పోకడ కూడా అలాగే ఉంటుంది. జీవన నదీ ప్రవాహంలో ఈత తెలిసిన వారు ఎప్పుడూ మునిగి పోరు. తెలియకనే మునిగి పోతారు. లోకం ఎవ్వరినీ ముంచదు. కాని, జ్ఞానం లేని కారణంగా అందరూ లోకంలో మునిగి పోతున్నారు. శోకము అనేది లోకంలో లేదు. మన అజ్ఞానంతో మనమే లోకంలో శోకాన్ని సృష్టించుకుంటున్నాం.

### పాట

పల్లవి : **శోకము ఉన్నదా? లోకములో** *
**ఏదని అడిగితే, లేదని తెలిసే ॥ శోకము ॥**

చరణము : **పల్లానికి పయనించే పావని**
**మీది కొచ్చి నిను ముంచినదా?**
**తెలియని తనమే తల ముంచేది**
**తెలిసిన క్షణమే తరియించేది ॥ శోకము ॥**

ఇప్పు దర్థమయిందా? మన బ్రతుకులలో నవ్వుల్ని దూరం చేసిం దెవరు? ప్రపంచమా? వ్యక్తులా? కానే కాదు. ఇదంతా స్వయంకృత అపరాధం. మన బాధలకు మనమే కారణము. మన నవ్వుల్ని దూరం చేసుకున్నది మనమే. లేని దానిని చూచే ప్రయత్నంలో ఉన్న ఆనంద స్వరూపాన్ని దూరం చేసుకున్నాం.

ఇదీ మన స్థితి. మనకు మనంగా కల్పించుకున్న పరిస్థితి. ఈ స్థితిలో మనల్ని మనమే నవ్వించుకొనే ప్రయత్నం చేయాలి. మనల్ని మనమే ఉద్ధరించు కోవాలి. ఇదే గీతా సందేశం కూడా. **ఉద్ధరే దాత్మ నాత్మానం** అన్నాడు భగవంతుడు.

**ఉద్ధరేత్, సంసార సాగరే నిమగ్నమ్, ఆత్మనా,**
**ఆత్మానం, తతః ఊర్ధ్వం హరేత్, ఉద్ధరేత్** –

సంసార సాగరంలో మగ్నమై యున్న తనను, తాను తన చేతనే, **ఉత్** = పైకి, **హరేత్**=తీయాలి. ఇది ఎవరికి వారుగా చేసుకోవాలని గీతా సందేశం. ఇదే వాస్తవం. కాని, ఇప్పుడు అలా కాదు. ఆ పని మేం చేస్తాం! బాధ పడకండి! మా దగ్గరికి రండి! అని కొందరు దుకాణాలు తెరిచారు. ఇంకా తెరుస్తున్నారు. అమ్మకాలు బాగా జరుగుతున్నా యని కూడా భోగట్టా. ఏం చేద్దాం? కలికాలం!

---

* సందర్భానుసారంగా ఈ పాటను స్వామీజీ ఆశువుగా పాడారు. మెల్లమెల్లగా అల్లుకుంటూ పాడటాన్ని శ్రోతలు గ్రహించడానికి శ్రమించలేదు. చరణము పాడేటప్పుడు, 'పల్లానికి ప్రవహించే గంగ' అని రెండు సార్లు పాడి, ఆ తరువాత 'పల్లానికి పయనించే పావని' అని సరళం చేస్తూ ఆలపించారు. ఇదంతా గమనించి గుర్తించిన శ్రోతలు పాట శ్రావ్యంగా పూర్తి కాగానే పెద్ద పెట్టున చేసిన కరతాళ ధ్వనులతో శ్రుతి మందిరం దద్దరిల్లింది. ప్రవచనాన్ని కొంతసేపు ఆపి, ఆ తరువాత పూజ్య స్వామీజీ ప్రారంభించవలసి వచ్చింది.

అదలా ప్రక్కన పెడితే, ఉన్న దానిని ఉన్నట్లు అంగీకరించడమే భాగ్యం. మహా భాగ్యం. **కౌపీనవన్తః ఖలు భాగ్యవన్తః** అన్నారు కౌపీన పంచకంలో శ్రీ శంకరాచార్యస్వామి.

అంటే, కౌపీనమే కలిమి అవుతుందా? దారిద్ర్యమే భాగ్యమా? అది ఆ వాక్యము యొక్క భావన కానే కాదు. అతనికి కౌపీనమే ఉంటే, అదే అతని భాగ్యము అనేది దాని భావన. బాగా అర్థం చేసుకోండి. మనకు ఏది ప్రాప్తమో అదే ప్రాప్తిస్తుంది. నీ కర్మ ఫలంగా ఏది నీకు ప్రాప్తిస్తే అదే నీ భాగ్యం. అదే నీ సంపద. ఏది ఎలా ఉంటే, దానిని అలా అంగీకరించడమే భాగ్యం. ఈ సత్యం బోధ పడితే, ప్రపంచం ఎలా ఉన్నా, వ్యక్తులు ఎలా ప్రవర్తించినా, నీ స్థితి గతులు ఎలా మారుతున్నా, అంతా భాగ్యం గానే స్ఫురిస్తుంది. కర్మఫలం గానే అర్థ మవుతుంది. ఈశ్వర ప్రసాదం గానే గోచరిస్తుంది. బుద్ధిలో ప్రసన్నత చెడదు. వ్యక్తిలో నవ్వులు దూరం కావు. కారణం, ఇక్కడ ఈశ్వరసృష్టే దర్శనీయ మవుతూ ఉంది. జీవసృష్టి అదృశ్యమైంది. అస్తు.

ఆత్మబంధువులారా! 'నవ్వుతూ జీవించాలి' అనే ఈ విషయాన్ని కొన్ని కోణాల నుండి పరిశీలించి అర్థం చేసుకున్నాం. సాయంత్రం ఆరు గంటలకు ప్రారంభమయ్యే రెండవ ఉపన్యాసంలో మరి కొన్ని కోణాలను వీక్షించి విశ్లేషించుకుందాం.

***లోకా స్సమస్తా స్సుఖినో భవన్తు!***





# నవ్వుతూ జీవించాలి - 2

ఆత్మబంధువులారా!

ఏదో చేయాలి అని మనం అనుకోవచ్చు. మరో విధంగా బ్రతకాలి అని మనం భావించ వచ్చు. కాని, నువ్వు చెయ్యాలి అనుకున్నది చేయ దగినదై ఉండాలి. అలాగే నువ్వు ఎలా ఉండాలి అనుకుంటున్నావో, అలా ఉండటానికి అనువైన పరిస్థితులు, పరిసరాలు ఉండాలి.

నవ్వుతూ జీవించండి అని మనం చెప్పవచ్చు. ఏడుస్తూ బ్రతకాలని ఎవరైనా అనుకుంటారా? నవ్వుల్ని పడేసుకొని ఏడుపుల్ని ఏరుకోవాలని ఎవరైనా అభిలషిస్తారా? అందరూ నవ్వుతూనే హాయిగా, ఆనందంగా జీవించాలని అభిప్రాయ పడతారు. కాని, ఎందుకో అలా జీవించలేక పోతున్నారు. కారణ మేమిటి?

సుఖపడాలి, నవ్వుతూ జీవించాలి అని మనిషి అభిలషిస్తున్నా, సుఖపడే పరిస్థితులు, నవ్వుతూ జీవించే స్థితిగతులు చుట్టూ లేక పోవడమే కారణమని కొందరు అభిప్రాయ పడుతున్నారు. అదీ వాస్తవమే. వారి అభిప్రాయంలో కూడా కొంత వాస్తవ ముంది. ఇవన్నీ కాలమార్పులు. ఇవి కూడా అర్థం చేసుకో దగినవే. వాటిని గూర్చి ముందుగా కొంత విశ్లేషించుకుందాం.

### జీవన ప్రయాణము

గువ్వ నివసించడానికి గూడు కట్టుకొని హాయిగా బ్రతికేస్తుంది. మనిషి తాను నివసించడానికి గృహాన్ని నిర్మించు కుంటాడు. కాని, గువ్వ లాగా హాయిగా బ్రతకలేడు. ఎందుకని? మానవుడు తనను తాను అంగీకరించ లేడు. ఈ సమస్య పశుపక్ష్యాదులలో లేదు.

నేను కుక్కను అని కుక్క బాధ పడటం లేదు. నేను కోతిని అని కోతి తనను తాను చిన్నచూపు చూసుకోవడం లేదు. మనిషి అలా కాదు. తాను కుక్క కాకపోయినా, చివరికి నాది కుక్క బ్రతుకైంది అని తల బాదుకుంటూ మరీ చెబుతున్నాడు. తాను కోతి కాకపోయినా, నేను కోతిలా ఉన్నాను అని తనను తానే చిన్నబుచ్చుకొని కుములు తున్నాడు.

పశుపక్ష్యాదులకు బ్రతకడమే ప్రధానము. మనిషి అలా కాదు. ఎలా బ్రతకాలి? అని ఆలోచించే బుద్ధి మనిషికే ఉంది. బుద్ధి భగవత్ప్రసాదము. అది వరమే గాని శాపం కాదు. బుద్ధిని ఉపయోగించి బ్రతుకును అందంగా నడుపుకోవడం, ఆనందంగా నవ్వుతూ జీవనయాత్ర కొనసాగించడము మనిషికే సాధ్యం.

ఎవరో బండిని నడుపుతూ ఉంటే, అందులో కూర్చొని ప్రయాణం చేయడమే పశుపక్ష్యాదులకు తెలుసు. కాని, మనిషి పరిస్థితి అలాంటిది కాదు. తనకు బుద్ధి ఉండటం

చేత తాను నడిపేవాడుగా ఉన్నాడు. బండిని నడుపుకుంటూ పోయేవాడుగా ఉన్నాడు. ప్రతి మలుపును గమనించాలి. ఎత్తుపల్లాలను మదింపు వేసుకొంటూ ముందుకు సాగాలి. ఎక్కడ తేడా వచ్చినా, బ్రతుకు ప్రయాణమే ప్రశ్నార్థక మవుతుంది. గువ్వ లాగా తనకు తానుగా ఎత్తుకు ఎగిరి పోలేడు. గుఱ్ఱం లాగా తన వేగాన్ని తాను పుంజుకుంటూ ముందుకు సాగి పోలేడు. తాను ఒంటరిగా లేడు. తాను ఒంటరివాడు కాడు.

### ఇళ్ళు - ఇబ్బందులు

ప్రతి మనిషికి ఇల్లు ఉంది. కాని, ప్రతి ఇంటిలో ఎన్నో ఉంటాయి. ఎందరో ఉంటారు. వాటితో పాటు కొరత కూడా ఉంటుంది. ఎప్పుడూ ఏదో ఒక విధమైన వెలితి ఉంటుంది. ఒక విధంగా చెప్పాలంటే అంతా వెలితే. అంతా కొరతే.

ఇంటిలో ఎందరో ఉంటారు. ఎవరి అవసరాలు వారికి ఉంటాయి. ఏవి అవసరాలు, ఏవి కావు అనే విషయాన్ని ప్రక్కన పెడితే, కలిసి వచ్చిన వైనా, కల్పించుకున్న వైనా అవసరాలు అవసరాలే. ఎవరి అవసరాలు వారివి.

అవసరాలు అందరికీ ఉంటాయి. అవసరాలు ఉన్నప్పుడు వాటిని తీర్చుకోవాలని మనిషి తపన పడతాడు. కొన్ని అవసరాలను తీర్చుకో గలుగుతాడు. అన్ని అవసరాలను తీర్చుకోలేడు. అవసరాలన్నీ పుష్కలంగా తీరవు. ఎన్ని తీరుతున్నా, మరి కొన్ని తీరకుండానే అలా మొండి కేసి ఉండి పోతాయి.

ఇంటిలో ఎందరో ఉంటారు. ఎవరి కోరికలు తీరవో, వాళ్ళు ముఖాలను వ్రేలాడ దీసుకొని భారంతో కనిపిస్తూ ఉంటారు. ఆ భారాన్ని భరించలేక వాళ్ళు అశాంతితో అగుపిస్తూ ఉంటారు. వాళ్ళను ఒక వైపు చూస్తూ నవ్వుతూ జీవించే దెలా?

ఇల్లు అన్న తరువాత అందులో కుటుంబము ఉంటుంది. కుటుంబ సభ్యు లందరు కలిసి జీవిస్తూ ఉంటారు. మనుషులు కలిసి ఉంటారే గాని, మనస్సులు ఎందుకనో కలసి ఉండవు. ఉండలేవు.

మనస్సులు కూడా కలిస్తే బాధ లేదు. కాని, తరచుగా మనస్సులు కలవని పరిస్థితినే అన్ని చోట్ల మనం చూస్తున్నాం. కారణ మేమిటి? ఎవరి నేపథ్యం వారిది కావడమే ఇందుకు ప్రధాన కారణము. ఎవరి ఆలోచనలు వారివి. ఎవరి అభిరుచులు వారివి. ఎవరి అభీష్టాలు వారివి. ఎవరి అవసరాలు వారివి. అందుచేత, ప్రతి ఇంటిలో ఏదో విధంగా ఒక రకమైన ప్రతికూల వాతావరణం ప్రతిబింబిస్తూ ఉంటుంది. ప్రతికూల వాతావరణంలో చరిస్తూ నవ్వుతూ జీవించడం అందరికీ సాధ్యపడే విషయ మేనా? ఆలోచించండి. ఈ విధంగా ఇళ్ళల్లో నవ్వులు దూర మవుతున్నాయి. ఇంటిలో పూయని నవ్వులు బయట విరబూస్తాయా? ఏమో! ఆశ అయితే మనిషికి ఉంటుంది. అందుకని, ఇంటిలో లభ్యం కాని నవ్వులను బయట అన్వేషించే ప్రయత్నం సాగిస్తాడు. సాగిస్తున్నాడు.



### బాహ్యము - బాధలు

ఇక ఇంటి నుండి బయటపడి బాహ్య ప్రపంచంలో ప్రవేశిస్తే చాలు. అన్నీ సమస్యలే. అది సమాజమో లేక సమస్యల నిలయమో అర్థం కాదు. అందరూ మాట్లాడుతూనే ఉంటారు. ఎవరి మాటల వెనుక ఏ అర్థాలు దాగున్నాయో ఎంత యోచించినా అర్థం కాదు.

వార్తల కొరకు పత్రికల్ని చూద్దామా అంటే, అన్నీ దుర్వార్తలే. దుర్మార్గపు వార్తలే. అసత్యపు ప్రచారాలే. విషయాల సంగతి, వార్తల విషయం ప్రక్కన పెడితే, పత్రికలు చదివిన పాపానికి మనస్సంతా చెడి పోతుంది. ఉదయం పత్రికలను చదివిన కారణంగా పాడై పోయిన మనస్సు సాయంత్రమైనా బాగు పడదు.

సాయంత్రం కాలక్షేపానికి సినిమా కెళ్ళినా అంతా కలుషితమే. కల్మషమే. చిత్తము నిండా చెత్త నింపుకొని ఇంటికి తిరిగి రావడమే. ఇక బుల్లితెరల విషయం చెప్ప నవసరం లేదు. అన్నీ కల్లబొల్లి కబుర్లే. వాటి పుణ్యమా అంటూ కొంపలే కూలి పోతున్నాయి.

### ఉద్యోగాలు - ఉద్వేగాలు

ఉదర పోషణార్థం ఉద్యోగాని కెళ్తే అక్కడా ఉత్సాహ ముండదు. పనులే గాని పనితన ముండదు. అంతా ఆవేదనే. ఆందోళనే. జీతం సకాలానికి రాదు. వచ్చినా ఇంటి ఖర్చులకు సరిపోదు. ఏదో ఓలాగా వచ్చే జీతంతో సరిపెట్టు కోవాలి. ధరలు ఆకాశా న్నంటుతూ ఉంటాయి. తినే శక్తి ఉన్నా కొనే శక్తి ఉండదు.

జీతం కోసం నిరీక్షించడమే సరిపోతుంది. జీతం వచ్చే సమయానికి ఇంటిలో ఎవరో ఒకరిని అనారోగ్యం ఆవరించి ఉంటుంది. వచ్చిన జీతంలో ఎక్కువ భాగము వైద్యానికి, వైద్యులకే సరి పోతుంది.

ఇక పని చేసే కార్యాలయం చూస్తే విభిన్న మనస్తత్వాలతో కూడిన వ్యక్తులతో ప్రతికూల వాతావరణమే ప్రతిబింబిస్తూ ఉంటుంది. ఆఫీసరు విషయం ఇక చెప్ప నవసరం లేదు. అతని దొక ప్రత్యేక వ్యవహార శైలి. ఎప్పుడు ఎలా ఉంటాడో తెలిసి చావదు.

ఏవో కొన్ని తారతమ్యాలతో మనుష లందరూ అలాగే వ్యవహరిస్తూ ఉంటారు. పెద్దవాళ్ళు అర్థం చేసుకోరు. చిన్నవాళ్ళకు చెప్పినా అర్థం కాదు. అంతట, అన్నిచోట్ల ఎందరి తోనో కలిసి ఉంటాం. మరెందరి తోనో కలిసి పని చేస్తాం. కాని, ఎవరి తోను కలిసి ఆనందంగా బ్రతకలేము. ఇక్కడే నవ్వులు దూర మవుతాయి. ఏడుపులు దగ్గరవుతాయి. ఈ విధమైన పరిస్థితుల మధ్య నవ్వుతూ జీవించే దెలా? ఇదే రెండవ ప్రవచనములో మనము విచారించ వలసిన విషయము.

ఇంతవరకు మనం చూచిన దానిని బట్టి మనిషి నవ్వలేక పోవడానికి ప్రధానంగా మూడు కారణాలు కనపడ్డాయి. (1) ప్రపంచము (2) వ్యక్తులు (3) ఈ రెండిటితో సంబంధము పెట్టుకొనే నీవు. ఈ మూడిటిలో ఏదో ఒకటి గాని, రెండు గాని, లేదా

మూడూ గాని నవ్వుకు ప్రతిబంధకాలుగా గోచరిస్తున్నాయి. అవరోధాలను అధిగమించే కార్యక్రమంలో భాగంగా ముందుగా పై మూడింటిని కొద్దిగా విశ్లేషించుకుందాం. ఆలోచించండి.

**(1) విషయ ప్రపంచము**

విషయ ప్రపంచం ఎలా ఉన్నా, ఈ ప్రపంచంలో వ్యవహారం సాగించాలంటే మనకు జ్ఞానం అవసరం. ఇది చాలా ప్రధానమైన విషయం. ప్రపంచానికి సంబంధించిన జ్ఞానం లేకుండా ప్రపంచంలో వ్యవహారం సాగించడం సులభ సాధ్యం కాదు.

మనం చరిస్తున్న ప్రపంచం మనం సృష్టించినది కాదు. మనం ఈ ప్రపంచం లోకి రాక ముందే ఈ ప్రపంచం ఉంది. రేపు మనం లేకుండా పోయినా ఈ ప్రపంచం ఉంటుంది.

ఇలా ఉంటున్న ప్రపంచం నియతితో ఉంది. అదే భూత భౌతిక నియతి. ఆ నియతి లోనే గ్రహాలు చరిస్తున్నాయి. సూర్య చంద్ర నక్షత్రాదులు ప్రకాశిస్తున్నాయి. చెట్లు పెరుగు తున్నాయి. వానలు జారు తున్నాయి. వాగులు పారుతున్నాయి. దీని వెనుక గొప్ప నియతి గోచరిస్తూ ఉంది.

నీరు చల్లగా ఉంటే, నిప్పు వేడిగా ఉంటుంది. ఇది ధర్మం. ఇది నియతి. ఈ ధర్మాలు మారేవి కావు. కొన్ని వేల సంవత్సరాల క్రితం ఇవి ఇలాగే ఉన్నాయి. భవిష్యత్తులో మరి కొన్ని వేల సంవత్సరాలు దొర్లినా, ఇవి ఇలాగే ఉంటాయి. ఇవే ధర్మాలు. ఇదే నియతి. ధర్మ రూపంలో ఉన్నది దైవమే. నియతి రూపంలో నియంతే ఉన్నాడు.

వీటిని అర్థం చేసుకోవడంలో జీవనకళ ఇనుమడిస్తుంది. ధర్మ జీవనంలో దైవశోభ కళకళ లాడుతుంది. ఇది అర్థమైతే మన కోరికలు మనకు ప్రతిబంధకాలు కాకపోగా, ప్రగతికి సోపానా లవుతాయి.

**ధర్మా౽విరుద్ధో భూతేషు కామో౽స్మి భరతర్షభ!**

ధర్మమునకు విరుద్ధము గాని కామము నేనే అన్నాడు గీతలో భగవంతుడు.

బాహ్య జగత్తు లోనే గాక మన దేహంలో కూడా అదే భూత భౌతిక నియతి ఉంది. ఏ అవయవము ఎలా ఉండాలో అలా ఉంది. అవన్నీ అర్థం చేసుకోవడానికే ఉన్నాయి. అవి అలా ఉండటం వెనుక నియతి ఉంది. ధర్మం ఉంది. ఆ నియమానికి కట్టుబడి మన దేహాలు మనుగడను సాగిస్తున్నాయి. అందుచేతనే **ధారయతి సర్వభూతాని ఇతి ధర్మః** – సర్వ ప్రాణులను ధరించేది, భరించేది ధర్మమని శాస్త్రం నిర్వచించింది. ఇది ఈశ్వర సృష్టి. కనుక, దానిని అర్థం చేసుకుంటూ జీవిస్తే ప్రపంచంతో మనకు ఘర్షణ ఉండదు.

**(2) వ్యక్తులు - వ్యక్తిత్వాలు**

వ్యక్తులతో సంబంధాలు లేకుండా మనిషి జీవించలేడు. సంబంధాలు ఏవైనా సంఘర్షణకు దారి తీసేవే. సంఘర్షణలు తలెత్తిన చోట సంతోషాలు నిలవవు. సంఘర్షణల మధ్యే నవ్వులు కారిపోతూ ఉంటాయి. వ్యక్తులతో సంఘర్షణ లేకుండా సంబంధాలను సంతోషంగా కొనసాగించాలంటే, వ్యక్తులపై మనకు (1) సానుభూతి (2) ప్రేమ ఉండాలి.



వ్యక్తుల ప్రవర్తనే మనకు కనిపిస్తూ ఉంటుంది. ఆ వ్యక్తి అలా ఎందుకు ప్రవర్తించాడు? అని ప్రశ్నించుకుంటే సమాధానం దొరకదు. ఒకవేళ సమాధానం దొరికినా ఆ సమాధానము మనకు సంతృప్తి నిస్తుందేమో గాని అది సత్యమని నిర్ధారించ లేము.

వ్యక్తి ఎలా ప్రవర్తించినా, అలా ప్రవర్తించడం వెనుక నేపథ్యం ఉంది. అది మనకు తెలిసి రాదు. అతని మనస్సు లోని ఆలోచనా సరళి, బుద్ధి లోని భావజాలము, ఆవేశాలు, ధర్మాధర్మ ప్రవర్తనము – ఇలా గతానికి సంబంధించిన జీవన విధానము ప్రస్తుతము అతని ప్రవర్తనమునకు కారణంగా ఉంది. ఈ నేపథ్యాన్ని అర్థం చేసుకోకుండా అతని ప్రవర్తనమును విశ్లేషించడం, విశదీకరించడం, విస్పష్టం చేయడం సాధ్యపడే విషయం కాదు.

ఒక వ్యక్తి అలా ప్రవర్తించాడు అంటే, అంతకన్నా మరో విధంగా ప్రవర్తించలేడు అని అర్థం. డ్రైవరు ఎలా త్రిప్పితే బండి అలా తిరుగుతుంది. నేపథ్యం ఎలా శాసిస్తే, మనిషి అలా ప్రవర్తిస్తూ ఉంటాడు. ఎదురీత అందరికీ సాధ్యం కాదు.

కనుక వ్యక్తుల ప్రవర్తనమును సానుభూతితో అర్థం చేసుకుంటే, వారిపై ప్రేమ పుట్టు కొస్తుందే గాని ఘర్షణకు తావు ఉండదు. వ్యక్తుల సంబంధాలలో ఘర్షణ లేనపుడు మనిషి ఆనందంగా ఉండ గలడు. నవ్వుతూ జీవించ గలడు.

ఇలా జీవించడానికి మనిషి మేధావి కానవసరం లేదు. ఈ విధమైన సానుభూతి, ప్రేమలతో కూడిన ప్రవర్తనమునకు పెద్ద చదువులు అవసరం లేదు. పెద్ద చదువు, గొప్ప మేధస్సు కలిగిన వారు నేరస్థులుగా మిగిలి పోవడం సమాజంలో మనం చూస్తూనే ఉన్నాం. సానుభూతితో, ప్రేమతో జీవించడానికి సంస్కారం తోడుంటే చాలు.

**యాచకుని యోచనా విధానము**

ఒక దుకాణం ముందు బిచ్చగాడు నిలబడి దానం చేయమని అర్థిస్తున్నాడు. అప్పుడే వర్తకుడు ఏదో సమస్యలో చిక్కుకొని ఆందోళన చెందుతున్నాడు. అదే సమయానికి బిచ్చగాడు అర్థించే టప్పటికి సంయమనం కోల్పోయిన వర్తకుడు బిచ్చగాణ్ణి పరుష పదజాలంతో తీవ్రంగా దూషించాడు.

అయినా, బిచ్చగాడు చలించలేదు. బాధ పడలేదు. దూషణలు పూర్తి కాగానే 'బాబూ! క్షమించండి. మీరేదో బాధల్లో ఉన్నారు. అది అర్థంగాక నేను మిమ్మల్ని మరింత బాధకు గురి చేశాను. ఎన్ని జన్మలలో ఎందరిని బాధించానో, ఇలా యాచకుణ్ణై బ్రతుకుతున్నాను. ఇప్పుడు కూడా మిమ్మల్ని బాధ పెట్టాను. నన్ను క్షమించండి. భగవంతుని దయతో మీ కష్టాలు తీరి పోతాయి. మీరు ఆనందంగా ఉంటారు' అని దణ్ణం పెట్టి మెల్లగా కదలి ముందుకు వెళ్ళాడు.

ఆ మాటలు వినిన వ్యాపారిలో అంతరేక్షణ ఆరంభమైంది. క్షణాల్లో క్రోధం మటుమాయ మైంది. హృదయం తేలిక పడింది. పరిస్థితి క్షుణ్ణంగా అర్థమైంది. బిచ్చగాని సానుభూతి వచనాలలో వర్తకుని బుద్ధి స్వాంతన పొందింది. అంతే. ఇదే సానుభూతి అంటే. ఇతరులలో దోషాలను దర్శించడం జీవసృష్టిలో భాగం. ఇతరుల ప్రవర్తనను సానుభూతితో ఘర్షణ లేకుండా వీక్షించడం ఈశ్వర సృష్టి దర్శనం.

**బుద్ధుని ప్రేమతత్త్వం**

గౌతమ బుద్ధుడు అరణ్యంలో ఒంటరిగా పోతున్నాడు. ఇంతలో గాయపడిన పక్షి ఒకటి వచ్చి అతని కాళ్ళ ముందు పడింది. దానిని బాణంతో కొట్టిన బోయవాడు క్షణాల్లో అక్కడికి వచ్చి, ఆ పక్షి తనకు సంబంధించిం దని, దానిని తనకు ఇవ్వమని అడుగుతాడు.

బుద్ధుడు, అందుకు అంగీకరించ లేదు. 'ఈ పక్షి నాది. ప్రస్తుతం నా చేతిలో ఉంది' అన్నాడు. 'దానిని నేను కొట్టాను. దానికి యజమానిని నేను' అన్నాడు బోయవాడు.

'చూడు నాయనా! శిక్షించే కాఠిన్యం నీలో యజమాని పాత్రను పోషిస్తే, రక్షించే కారుణ్యం నాలో విశ్వవిజేతగా ఉంది. ప్రేమ ప్రభుత్వాన్ని శాసించే అధికారం ఎవ్వరికీ లేదు', అని పలికి ఆ పక్షిని తన వద్దే ఉంచుకొని, దాని గాయం నయం కాగానే వినీలాకాశం లోకి విడిచి పెట్టాడు బుద్ధుడు. ఇదే సానుభూతితో కూడిన ప్రేమ జీవనం.

***(3) స్వకీయము***

ఇక తన విషయం. వ్యక్తి తనతో తాను వ్యవహరించడానికి ఏమి అవసరం? ఏమీ అవసరం లేదు. తానే అవసరం. నీ విషయంలో నువ్వే అవసరం. నువ్వొక్కడివి ఉంటే చాలు. నువ్వేమిటో నీకు తెలిస్తే, నువ్వు నువ్వుగా ఉండ గలిగితే, నువ్వు ఏమీ చేయలేక పోయినా నవ్వుతూ జీవించ గలవు. నువ్వే నీకు సమస్య అయినపుడు, నువ్వు సమస్యల్ని ఎలా ఎదుర్కొంటావు? నవ్వుతూ ఎలా జీవిస్తావు?

***అంతర్మథనం***

నేను నవ్వుతూ జీవించలేక పోతున్నాను, కష్టాల ఊబిలో కూరుకుపోయి బాధ పడుతున్నాను అని ఎవరైనా భావిస్తే, వారు కారణాలను ప్రపంచానికి ఆపాదించడం కాకుండా, ఇంత విశాలమైన ప్రపంచంలో, ఇన్ని అద్భుతాల మధ్య, వింతల మధ్య నేను ఎందుకు సుఖపడలేక పోతున్నాను? ఎందుకు నవ్వలేక పోతున్నాను? అని తనను తాను ప్రశ్నించుకోవాలి. సుఖంగా బ్రతకలేని పరిస్థితి నాకే ఎందుకు ప్రాప్తించింది? నవ్వలేని దుస్థితి నాకే ఎందుకు దాపురించింది? అని తనలో తాను విశ్లేషించుకోవాలి.

నదులు చల్లగా, హాయిగా పారుతున్నాయి. చల్లదనాన్ని అవి క్షణం కూడా పారేసుకో లేదు. గాలులు తూగుతూ, ఊగుతూ ఊరేగుతున్నాయి. తమకు తాము భారమై క్రుంగి పోలేదు. చెట్లు చలిస్తూ ఆడుకుంటున్నాయి. చలిస్తున్నాయే గాని మన లాగా చంచలం



కావడం లేదు. ఎన్ని జలాలు వచ్చి పడుతున్నా, మరెన్ని జలాలు ఆవిరై పోతున్నా సముద్రం పూర్ణం గానే ఉంది. వన్యమృగాలు, పక్షులు సృష్టిలో నియతిని అనుసరిస్తూ బ్రతుకు తున్నాయి. వాతావరణం అనుకూలించక పోతే వేల కిలోమీటర్లు ప్రయాణం చేసి అనుకూలమైన ప్రదేశానికి పక్షులు చేరి పోతున్నాయి. ఎక్కడ నైజీరియా? ఎక్కడ నెల్లూరు? మధ్యలో ఎంత దూరం? ఎంత విశాలమైన సముద్రం? అయినా, పక్షులు రెండు రెక్కలతో ఎగురుతూ వచ్చి, కనులకు విందు చేస్తున్నాయి అంటే, ఎంత ధైర్యం? తమ మీద తమ కెంత నమ్మకం? అవును. ధైర్యవంతులే ఏదైనా సాధించ గలరు. ధీశాలురే ప్రగతిని హస్తగతం చేసుకో గలరు (Future favours the brave).

**పరాంచి ఖాని వ్యతృణ త్స్వయంభూః**
**తస్మా త్పరాజ్ పశ్యతి నాంతరాత్మన్ ।**
**కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష**
**దావృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్ ॥**

సృష్టికర్త (**స్వయంభూః**) ఇంద్రియాలను (**ఖాని**) కేవలము బాహ్య విషయములను గ్రహించునట్లు (**పరాంచి**) సృష్టించి, మనల్ని చాలా బాధ పెట్టాడు (**వ్యతృణత్**). అందుచేత (**తస్మాత్**) ఇంద్రియములు బాహ్య విషయాలనే చూస్తాయి (**పరాజ్ పశ్యతి**). అంతరాత్మను చూడలేవు (**న అంతరాత్మన్**). కాని, ఒకానొక ధైర్యవంతుడు (**కశ్చిత్ ధీరః**) అమృతత్వమును అభిలషించిన వాడై (**అమృతత్వం ఇచ్ఛన్**), ఇంద్రియాలను అంతర్ముఖము గావించి (**ఆవృత్త చక్షుః**), ప్రత్యగాత్మ స్వరూపమును చూడ గలుగుచున్నాడు (**ప్రత్యగాత్మానం ఐక్షత్**) అని కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతునికి బోధించడం జరిగింది. కనుక తనను తాను తెలుసుకోవా లనుకున్నా, తాను తానుగా ఉండా లనుకున్నా, తన సహజమైన బలహీనతలను ప్రక్కకు నెట్టి, మనిషి ధీశాలుడై ముందుకు సాగాలి.

Cowards die many a time
The valiant never taste of death but once.

'పిరికివాళ్ళు అనేకసార్లు చస్తూ ఉంటారు. కాని ధీశాలురు చావును ఒక్కసారే చూస్తారు' అన్నాడు జూలియస్ సీజర్ నాటకంలో షేక్స్పియర్.

కనుక, నవ్వుతూ జీవించాలి అంటే, నిన్ను నీవు తెలుసుకోవాలి (Know your-self). నువ్వు నువ్వుగా ఉండాలి (Be yourself). తామేమిటో తమకే తెలియని వాళ్ళు, తాము తాముగా ఉండలేని వాళ్ళు ఎలా నవ్వుతూ జీవించగలరు?

**పూర్వ వైభవం**

బ్రతుకుతెరువు విషయంలో, జీవన విధానంలో మనకు, మన పూర్వీకులకు ఎంత తేడా ఉంది! మనకు తెలిసింది ఏడుపు; తెలియనిది నవ్వు. మన పూర్వీకులకు తెలిసింది నవ్వు; తెలియనిది ఏడుపు. వాళ్ళకు మనకు ఇంతే తేడా.

మన కున్నంత చదువు, లౌకిక విజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానం మన పూర్వీకులకు లేకపోవచ్చు. కాని, మనకు లేని నవ్వులు వాళ్ళ కున్నాయి. వాళ్ళకు వాళ్ళున్నదూ [illegible] కాలేదు. వాళ్ళు అలా ఉండటానికి, ఆనందంగా జీవించడానికి కారణా లున్నాయి. (1) కష్టపడి శ్రమించే వాళ్ళు. (2) ఉన్నదానితో తృప్తి చెందేవాళ్ళు. (3) అత్యాశలు, దురాశలు అర్థం కాని వాళ్ళు. (4) ఉండ దగినదే ఉన్నది అని ప్రగాఢంగా విశ్వసించేవాళ్ళు.

శ్రమించి కష్టపడే వారే గాని కష్టాన్ని కష్టంగా భావించే వారు కారు. కష్టపడి శ్రమించడ మనేది ధర్మంగా భావించే వారు. ధర్మ నిర్వహణయే కర్తవ్యం అని విశ్వసించే వారు. అలా జీవించడం భగవంతుడు అనుగ్రహించిన అవకాశమని పొంగిపోయే వారు. అందుకనే, కష్టపడి పొలాలలో పని చేస్తున్నా, ఆటపాటలలో పడి శ్రమను మరచిపోయే వారు.

మనకు శ్రమించడమూ తెలియదు. కష్టించి పని చేయడమూ ఇష్ట ముండదు. కాని సుఖాలను కష్టాలుగా భావించుకొని పరితపించడం తెలుసు. సుఖపడే కాలాన్ని కష్ట కాలంగా ఎలా మార్చుకోవాలో ఇంకా బాగా తెలుసు.

కాని, మన పూర్వీకులు అలా లేరు. కష్టాలను సుఖాలుగా, వియోగాలను సంయోగాలుగా ఎలా మార్చుకోవాలో వాళ్ళకు బాగా తెలుసు. వాళ్ళకు గొప్ప చదువులు లేకపోయినా, శాస్త్రాన్ని వారు గురుముఖతః అభ్యసించక పోయినా, శాస్త్రార్థానికి అద్దం పట్టే సంప్రదాయంలో వాళ్ళు పెరగడమే ఈ విధమైన శుభ సంస్కారాన్ని ప్రోది చేసుకోవ డానికి దోహద పడింది.

ఆవేశాలు అందరికీ ఉంటాయి. మనకూ ఆవేశా లున్నాయి. మన పూర్వీకులకూ ఆవేశా లున్నాయి. మనకు ఆవేశా లొస్తే బ్రతుకులే అంతరించి పోతున్నాయి. మన పూర్వీకులకు ఆవేశా లొస్తే అవి కళాకాంతుల్ని విరజిమ్ముతూ ఉండేవి.

ఈ రోజులలో భార్యాభర్తల మధ్య మాటకు మాట తేడా వస్తే, ఇక ఇంతే సంగతులు. అంతటితో అంతమై పోతాయి సంబంధాలన్నీ. కాని, మన పెద్దలు అలా కాదు. అపార్థాలను, ఆవేశాలను పతనానికి హేతువులుగా కాకుండా, ప్రగతికి సోపానాలుగా మలచుకొనే వారు. బాగా పరిశీలించి పరిశోధిస్తే, ఈ సత్యాలన్నీ జానపద గీతాలలో, పల్లెపాటలలో మనకు గోచరిస్తాయి. ఈ సత్యానికి అద్దం పట్టే పాటతో కూడిన ఒక సన్నివేశాన్ని ఉదహరిస్తాను. పూర్వ వైభవం ఎలా ఉండేదో తిలకించండి.

**వినోదాలు - వికాసాలు**

పడుచు తనములో ఉండే భార్యాభర్తలు ఒకనాడు పొలంలో కలిసి పని చేసుకుంటున్నారు. పరస్పరం వారి సంభాషణములో ఎక్కడో తేడా తొంగి చూసింది. మాటా మాట పెరిగింది. కయ్యానికి బాట ఏర్పడింది. భర్త విసిగి పోయి, 'ఛీ! నీతో కాపురం చెయ్యలేను. నా దారేదో నేను చూసుకుంటాను. ఇక, నీకూ నాకు ఏ సంబంధం లేదు. ఈ



ఊరి నుండే వెళ్ళి పోతున్నాను' అని అరుస్తూ, మొలకు బిగించి కట్టిన గుడ్డను దులిపి భుజాన వేసుకొని చెదిరిన ముంగురులను సరి చేసుకుంటూ బయలుదేరాడు. అంతే. అది చూచిన అర్ధాంగి పరుగు లెత్తుతూ వచ్చి, భర్త దారికి అడ్డంగా నిలబడి, కొంటె చూపులు విసురుతూ కూని రాగం తీసింది. క్షణాల లోనే పాట నందుకొని, అందంగా అడుగులు వేస్తూ ఆడటం ఆరంభించింది.

**పాట**

పల్లవి : **పోతా వెక్కడికి? పోకిరి పిల్లోడా!**
**పోదు పోరు - రాదు ఊరు** ॥ **పోతా వెక్కడికి** ॥

చరణము(1) : **పొర ఉంది - పొరిపోకు**
**గునప ముంది - గుబులు చెందకు**
**అయ్య ఉన్నాడు అలస టెందుకు?**
**చూసుకో . . . చేసుకో . . . నవ్వుకో !**

**పోతా వెక్కడికి? పోకిరి పిల్లోడా!**
**పోదు పోరు - రాదు ఊరు**

చరణము(2) : **చెయ్యిచ్చినోడు చేనిచ్చినాడు**
**కాళ్ళిచ్చినోడు కంకిచ్చినాడు**
**కనిపెట్టుకుంటాడు కడుపిచ్చినోడు**
**నన్నిచ్చినాడు . . . . నవ్వుకో!**

**పోతా వెక్కడికి? పోకిరి పిల్లోడా!**
**పోదు పోరు - రాదు ఊరు**

అంటూ పాడుతూ, ఆడుతూ భర్త ఆట కట్టేసింది భార్య. ఈ సన్నివేశంలో, ముఖ్యంగా ఈ జానపద గీతంలో ఎన్ని విషయాలు దోబూచు లాడుతున్నాయో? ఎన్ని రసాలు పొంగి ప్రవహిస్తున్నాయో చూశారా?

అలిగి పారి పోతున్న భర్తను బ్రతిమాలి ఆపకుండా, బెదిరించి నిలపకుండా, **పోకిరి పిల్లోడా!** అంటూ చనవుతో, సరసంతో భర్త హృదయాన్ని రంజింప చేసింది చదువు రాని ఆ పల్లె పడుచు. అదే జీవనం. అదే సౌందర్యం. అదే జీవన సౌందర్యం. పోకిరి పిల్లోడా! అనే ఆ ఒక్క సంబోధనతో భర్త కోపాన్ని బౌండరీ లైను దాటిం చేసింది. అప్పటికే భర్త చల్లబడి ఉంటాడు. ముందుగా భర్త మనస్సును శాంతింప చేసి, క్రోధావేశాన్ని పారద్రోలి, ఆ తరువాత, చల్లబడ్డ హృదయానికి సత్యాన్ని రంగరించి త్రాగించే ప్రయత్నం చేస్తూ, ముందుగా కాళ్ళకు బంధం వేసింది. ప్రేమతో కట్టి పడేసింది. అనురాగాన్ని, ఆప్యాయతను, అనుబంధాన్ని కలబోసి అడుగు ముందుకు పడకుండా బంధం వేసింది. ప్రేమ బంధం వేసింది.

**కర్మ రహస్యము**

ఎక్కడికి పోతావు? అంటూ భర్త ముందరి కాళ్ళకు బంధాన్ని తగిలించి, ఆ తరువాత **పోదు పోరు - రాదు ఊరు** అంటూ ప్రాప్తాప్రాప్తముల చిట్టాను విప్పింది. నా దారిన నేను పోతాను, ఊరు విడిచి పోతాను అన్న భర్తను నిలదీస్తూ, 'ఎక్కడికి పోతావు? మనిద్దరి మధ్య పోరుందని పారి పోవడమేనా? ఇది మన మధ్య పోరు కాదు బాబూ! జీవన పోరాటం. ధైర్యంతో ఎదురొడ్డి గెలవాలే గాని పారి పోకూడదు అనే జీవన సత్యాన్ని వినిపించింది. భర్త హృదయంలో ధైర్యాన్ని నూరిపోస్తూ, తనకు శాస్త్రం తెలియక పోయినా, **'క్షుద్రం హృదయ దౌర్బల్యం'** అనే గీతాచార్యుని సందేశాన్ని తన మాటల్లో పలికి భర్తను ఓదార్చింది.

పోరు అనేది ఎప్పుడూ ఉండదు. పైగా, పోరాటం లోనే ఏదైనా సాధింప బడుతుంది. ఇక్కడ పోరుందని పారిపోతే, అక్కడ ఉండదనే నమ్మక మేమిటి? పోరాడ వలసిన ప్రారబ్ధమే ఉంటే పాతాళంలో దాగినా పోరాటము ఆగదు అనే జీవన సత్యాన్ని పలికింది. పైగా ఊరు విడిచి వెళ్ళినా, పోరు లేని ఊరు రాదు అని కూడా చెబుతూ ఉంది. ఇదెంత వాస్తవం! ఎంత సత్యం!

ఎవరు ఎక్కడికి పోయినా వారి నీడ వారిని వెంబడిస్తూనే ఉంటుంది. ఇక్కడ నుండి పారిపోయినా, ఉన్న ఊరు విడిచి దూరతీరాల కేగినా అక్కడ ఏదో ఉండదు. ఇక్కడ ఉండినదే ఉంటుంది. తొలగించు కొనిన వాటినే తగిలించు కోవలసి వస్తుంది. దేశాలు మారినా, కాలాలు మారినా, నీకు ఉన్నది పోదు, నీకు లేనిది రాదు అనే కర్మ సిద్ధాంతాన్ని పొడి పొడి మాటలలో కమ్మగా వినిపించింది.

**నీది కానిది నీకు లేనిది రమ్మన్నా రాదు**
**నీది అయినది నీకొర కున్నది పొమ్మన్నా పోదు**
**ఉండే వాటిని పొమ్మనకు మరి లేనివి రమ్మనకు**
**రాకపోకల వాడుక తెలియక వేడుక లేదనకు**
**ఏ కర్మమునకు ఏది ఫలమో ఎరిగిన వారెవరు?**
**చేసిన కర్మము ఫలమును పొందక దాటే వారెవరు?**

అంటూ చైతన్య గీతిక విస్తరించి పలికిన కర్మ రహస్యాన్ని **పోదు పోరు - రాదు ఊరు** అనే నాలుగు పదాలు కలిగిన రెండు మాటల్లో ముక్తసరిగా పలికింది.

**కర్తవ్య బోధ**

**పార ఉంది పారిపోకు**

**గునప ముంది గుబులు చెందకు** - అంటూ చరణాన్ని కదిలించి స్వధర్మానుష్ఠానాన్ని తెలియ చేస్తూ కర్తవ్యాన్ని బోధించింది. నిస్సహాయత ఎందుకు? నీరస మెందుకు? నీవు చెయ్య వలసింది, చేయదగింది నీ కొరకు ఎదురు చూస్తూ ఉంది. కర్తవ్యాన్ని ఆచరించు.



ధర్మాన్ని అనుష్ఠించు. ఇదే భగవంతుడు నీకు అందించిన, ఆచరించమని నిన్ను ఆదేశించిన కార్యము. **కర్మణి ఏవ అధికారః తే** - నీకు అధికారము కర్మాచరణము నందే అని కర్మయోగానుష్ఠాన విధిని తెలియ పరచింది.

ఆ తరువాత **అయ్య ఉన్నాడు అలస టెందుకు**? అని ప్రశ్నించింది. నువ్వు చెయ్యాల్సింది చేస్తే భగవంతుడు ఇవ్వాల్సింది ఇస్తాడు. ఏది నీకు రావాలో అది నీకు వచ్చి తీరుతుంది. ఫలం విషయంలో బెంగ పెట్టుకో నవసరం లేదు **(మా ఫలేషు)**. కర్మఫల ప్రదాత పరమేశ్వరుడు. ఇచ్చేవాడు ఈశ్వరుడు. నీకు అలస టెందుకు? అని నిలదీసింది. అయ్యను, ఈశ్వరయ్యను ఆశ్రయించి శరణాగతుడవు కా! **(తమేవ శరణం గచ్ఛ, తం ఈశ్వరం పరమేశ్వరం శరణం ఆశ్రయం గచ్ఛ)** అని గుండె నిండా భక్తి రసాన్ని నింపింది.

చెయ్యిచ్చినోడు చేతి నిండా పని పెట్టేందుకు చేను నిచ్చాడు. కయ్య నిచ్చిన కన్నయ్య దుక్కి దున్నేందుకు కాళ్ళిచ్చాడు. కష్టించి పని చెయ్యి. కడుపు నిచ్చిన కైలాసపతి దాని విషయం చూసుకుంటాడు అంటూ ధైర్యాన్ని, ఆత్మ స్థైర్యాన్ని కలిగించడమే గాక, **నన్నిచ్చినాడు నవ్వుకో** - అని చివరగా చమత్కరించింది. ఇది కేవలం చమత్కారం కాదు. నీకు నేను తోడుగా ఉన్నాను. నిన్ను నేను సదా నీడలా అనుసరిస్తాను **(ఛాయేవ అనుగతా సదా)**. నీ కష్టసుఖాలలో పాలు పంచుకుంటాను అని భర్తకు భార్య ఇస్తున్న భరోసా! ఆహా! ఏమి వాళ్ళ జీవన సౌందర్యం? అద్భుతం. అనిర్వచనీయం. ఇలా ఆవేశాలలో కూడా వారికి ఆనంద గీతాలు ఎలా వస్తాయి అని ఆశ్చర్య పడుతున్నారా? వాళ్ళల్లో తృప్తి ఉంది కనుక పాటలు పెల్లుబికి వస్తాయి. అసంతృప్తి లేదు కనుక ఆటలు అలరిస్తూ ఉంటాయి. వారికి ఏదుందో దానితో వాళ్ళు తృప్తిగా ఉండటమే ఈ విధమైన జీవన వైభవానికి కారణము. ఇలా ఉండబట్టే మన పూర్వీకులు నవ్వుతూ జీవించ గలిగారు.

**ఎడ మొహం పెడ మొహం - ఇసుక తక్కెడ పేడ తక్కెడ** లా ఉంటే ఎలా నవ్వుతూ జీవిస్తారు? భార్యాభర్తలు ఎప్పుడైనా, ఎక్కడైనా నవ్వుతూ జీవించాలంటే, వారు **63** గా ఉండాలే గాని, **36** గా ఉండకూడదు. అరవై మూడు సంఖ్యలో ఆరు మూడును, మూడు ఆరును చూస్తూ ఉంటాయి. అంటే, భర్త భార్య హృదయాన్ని, భార్య భర్త హృదయాన్ని తిలకిస్తూ పులకిస్తూ, పరవశిస్తూ ఉండాలి అని అర్థం. అదే ఆదర్శ దాంపత్య మంటే. ఇక ముప్పై ఆరు అంటారా, మూడు ఇటు తిరిగితే, ఆరు అటు తిరిగి ఉంటుంది. అదే ఎడ మొహం పెడ మొహం అంటే. భార్యాభర్త లిరువురు ఉత్తర దక్షిణ ధృవాలుగా ఉంటూ మనుగడను సాగిస్తూ ఉంటే నవ్వుతూ ఎలా జీవిస్తారు? **హృదయం తే దదామి, తవ చిత్తం అనుచిత్తం భవతు** - నా హృదయాన్ని నీ కిచ్చేశాను. ఇక నీ, నా హృదయాలు లేవు. మన హృదయమే ఉంది అనే దివ్య భావనే గృహస్థాశ్రమ దీపాన్ని నిత్యము జాజ్వల్యమానం చేస్తూ ఉంటుంది. ఇక, పిల్లల విషయాన్ని కూడా విశ్లేషించుకుందాం.

**సంతానము - సౌభాగ్యము**

గృహస్థాశ్రమంలో భార్యాభర్తల తరువాత గణనీయమైన పాత్ర పిల్లలది. సంతానానిది.

కుటుంబంలో బిడ్డ లుంటారు. బిడ్డలు ఉండాలి. గోల చేసినా బిడ్డలు ఉంటేనే ఆనందం. బిడ్డలు లేని కుటుంబం నీరు లేని నది లాంటిది. ఆకు రాలిన చెట్టు వంటిది.

బిడ్డ లెవరు? మన బిడ్డలే. వాళ్ళు ఎలా పెరగాలి? చెప్పండి. బిడ్డలు బిడ్డలుగా పెరగాలి. అప్పుడే ఇంటిలో ఆనందం. ఉత్సాహం. కాని, ఇప్పుడు ఆ పరిస్థితి మారి పోయింది. కాలమార్పులు సంతాన వ్యవస్థను కూడా కూల దోసేశాయి.

బిడ్డలు మన వాళ్ళే అయినా, మనకు దూరంగా బ్రతకాలి. కారణం? మనకు ధనం, సంపద, ఐశ్వర్యం, సంపదలు కావాలి. అందుకొరకు సంతానము దూరమైనా ఫరవాలేదు. బిడ్డలు ఒంటరి వాళ్ళై పోయినా ఫరవాలేదు.

దంపతులు ఒంటరిగా ఉన్నారని, భగవంతుడు కరుణించి బిడ్డల్ని ప్రసాదిస్తే, వాళ్ళను ప్రేమతో పెంచుతూ, వాళ్ళ మధ్య హాయిగా జీవిస్తూ నవ్వుకోవడం చేత కాక, బిడ్డల్ని ఒంటరి వాళ్ళను చేసి, నవ్వుల్ని పారేసు కుంటారా? ఆనందాలను దూరం చేసుకుంటారా? తల్లిదండ్రులు చెయ్యాల్సిన పనేనా ఇది?

బిడ్డల్ని రెసిడెన్షియల్ పాఠశాలల్లో పడేసి, వాళ్ళ బ్రతుకుల్ని ఎడారిగా మార్చేస్తున్నారు. ముక్కు పచ్చ లారని పూపవయస్సు లోనే బిడ్డల హృదయాలలో అయోమయాన్ని సృష్టించి, వారిని నిరాశావాదులుగా తయారు చేస్తున్నారు. వాళ్ళల్లో అవ్యక్తంగా పొంగి పొరలుతున్న ప్రేమలను ఆవిరిగా మార్చేస్తున్నారు.

బిడ్డలను ఏమి చదివించాలి? ఎలా చదివించాలి? అనేది మనం మర్చిపోయాం. ఏ చదువు చదివిస్తే, రేపు భవిష్యత్తులో వాళ్ళు కోట్లు ఆర్జిస్తారో ఆ చదువులను మదింపు వేసుకొని చదివిస్తున్నాం. రేపు ఆ బిడ్డలే పెద్దవాళ్ళై, డబ్బే ప్రధానంగా భావించి, మనల్ని విడిచిపెట్టి డబ్బున్న దేశాలకు తరలిపోతే, అబ్బ! నా బిడ్డ స్వర్గంలో ఉన్నాడు అని దండోరా వేసుకోవడమే గాని, దూరమైన బిడ్డలు మన బ్రతుకుల్లో నవ్వుల్ని కూడా దూరం చేసేశారని గ్రహించలేక పోతున్నాం.

ఈ రోజు గ్రహించలేక పోయినా, గ్రహించ గలిగే రోజొక టొస్తుంది. కాకపోతే, అది చేతులు కాలిన తరువాత ఏదో పట్టుకున్నట్లే ఉంటుంది. అప్పు డేమంటారో తెలుసా? ఇంత కష్టపడి చదివిస్తే, మమ్మల్ని వృద్ధాశ్రమం పాలు చేస్తారా? వీళ్ళు బిడ్డలా, మట్టి గడ్డలా? అంటూ బిడ్డల్ని ఆడిపోసుకుంటూ ఉంటారు.

ఇక్కడే కాస్త లోతుగా ఆలోచించాలి. నిజంగా బిడ్డలు మిమ్మల్ని త్యజించారా? ఇది వాస్తవమా? కానే కాదు. మీరు నేర్పిన, నేర్పించిన విద్యను వారు త్యజించ లేకున్నారు. అంతే. బాగా ఆలోచించి అర్థం చేసుకోండి.

ఇతరులు మనల్ని కొట్టడానికి వస్తే, మనం మన చేతిని అడ్డం పెట్టుకుంటాం. మన తలను మనమే బాదుకొనేందుకు అలవాటు పడితే, అడ్డు కొనేందుకు ఎవరుంటారు? బ్రతకడం చేత కాక, నవ్వుతూ జీవించడం తెలియక, మన బిడ్డల్ని మనమే మనకు దూరం చేసుకొంటూ ఉంటే, ఈ ఘనకార్యానికి సలహా లివ్వడానికి ప్రబుద్ధులు కొందరు సుబుద్ధుల



అవతారా లెత్తుతున్నారు. ప్రతి రోజు బుల్లి డబ్బాలలో కూర్చొని ఇదే గొడవ. ఏ చదువు చదివితే బిడ్డల భవిష్యత్తు బాగుంటుంది? బిడ్డలకు ఏ చదువులు చెప్పిస్తే బొక్కసం నిండుతుంది? ఈ ప్రశ్నలకు సమాధానా లిచ్చేందుకు ప్రత్యేకంగా ఫీజులు కూడా ఉంటాయి. డబ్బు ఎలా సంపాదించాలో తెలిపే సలహా లిచ్చేవాడు డబ్బు తీసుకోకుండా సలహా లిస్తాడా?

దేనికి ఈ మితిమీరిన డబ్బు? డబ్బుంటే వస్తువులు కొంటావు. సౌకర్యాలు పొందుతావు. అంతే గాని సుఖాలను డబ్బు కొన గలుగుతుందా? ధనం నవ్వుల్ని కొని ఇవ్వ గలుగుతుందా? నవ్వుల ఖరీదెంతో నీకు తెలుసా? వస్తువులను కొంటే వస్తువులకు గ్యారంటీ ఇస్తారు. బ్రతుకుకు గ్యారంటీ ఉందా? Mors certa - Hora incerta. చావు వస్తుందని అందరికీ తెలుసు. చావు ఎప్పుడొస్తుందో ఎవరికి తెలుసు? ఎప్పుడు ఎవర్ని పోగొట్టు కుంటామో తెలియదు. అలాంటి క్షణ భంగురమైన జీవితంలో శైశవములో ఉండే పసిబిడ్డను చేజేతులా ఇంటికి దూరం చేసుకోవడమా! ఎంత దురదృష్టం!

బిడ్డల్ని బిడ్డలుగా పెంచడం తెలిసిన వారే తల్లిదండ్రులు. నాన్న సాయంత్రం అలసిపోయి ఇంటికి వస్తే, మట్టిలో ఆడుకుంటున్న బిడ్డ తండ్రిని చూడగనే మురికి చేతులతో పరుగు లెత్తుతూ వచ్చి, 'మా నాన్నొచ్చాడు – మా నాన్నొచ్చాడు' అని తండ్రిని చుట్టేస్తే, ఆ తండ్రి ఆనందానికి అవధులు లేకుండా పోయేవి. ఆ దృశ్యాన్ని చూచి తల్లి చలించి పోయేది. ఈ రోజుల్లో ఆ పరిస్థితి ఉందా? ఇక, నవ్వుతూ బ్రతికే దెలా సార్!

రోజులు మారాయి. ఊహించ నంతగా మారి పోయాయి. ఈ రోజుల్లో అలా తండ్రిని చుట్టేసే బిడ్డ లేరి? ఒకవేళ బిడ్డ ఉండి తండ్రిని పట్టుకుంటే, మట్టి చేతులతో వాటేసుకుంటే, పాంటు మాసి పోతుందేమో, షర్టు నలిగి పోతుందేమో! అని ఆలోచించే తండ్రులు తయారయ్యారు. నలిగి పోయేది నిజమే. కాని, నలిగి పోయేది బట్ట కాదు; బ్రతుకు.

మురికి చేతులతో చుట్టేసిన బిడ్డ ప్రేమకు మురిసిపోయే గుణం దైవగుణం. అదే శ్రీశైల క్షేత్ర మహిమ. మల్లికార్జున స్వామి దర్శనానికి వెళ్ళిన భక్తులు ముందుగా వెళ్ళి గర్భ గుడిలో స్వామిని పట్టుకొంటారు. దానినే ధూళి దర్శనం అంటారు. అంటే క్షేత్రానికి చేరగానే స్నానాదులు ఆచరించకుండానే వెళ్ళి భగవంతుని స్పృశించడము ధూళి దర్శనం. ఆ తరువాత, స్నానాదులు ముగించుకొని, పూలు, పండ్లు, కొబ్బరికాయ చేత పట్టుకొని రెండవ సారి వెళ్ళి అర్చనాదులు పూర్తి చేసుకుంటారు భక్తులు. తనను దర్శించడానికి వచ్చిన బిడ్డల్ని జగత్పిత యైన పరమేశ్వరుడు, ధూళితో వచ్చి దర్శిస్తే సంతోషిస్తున్నాడు. ఇదే ప్రేమ. పరమ ప్రేమ. దైవప్రేమ. ఈ విధమైన ప్రేమయే పూర్వము బిడ్డలకు, తల్లిదండ్రులకు మధ్య ఉండేది. నేడు ఆ పవిత్రమైన ప్రేమబంధాలు మృగ్య మయ్యాయి. అందుకే నవ్వులు లేకుండా పోయాయి. దైవగుణం నవ్విస్తుంది. అసురగుణం ఏడిపిస్తుంది.

స్వేచ్ఛా గాలుల్ని పీలుస్తూ, ఆకాశంలో ఆనందంగా విహరించే గువ్వ ల్లాగా, మన కళ్ళ ముందు ఆడుకో వలసిన బిడ్డల్ని, శైశవం లోనే ఇంటికి దూరం చేసి, జైళ్ళల్లో ఖైదీలు గదుల్లో నుంచొని ఊచలు పట్టుకొని బాహ్యాన్ని చూచినట్లు, హాస్టలు గదులలో బందీలను చేసి బాహ్యాన్ని చూచే పరిస్థితిని కల్పిస్తారా?

జైళ్ళల్లో ఖైదీలతో ములాఖాత్ అయినట్లు, వారానికి ఒక్కసారి ములాఖాత్ పేరుతో ఆదివారం వెళ్ళి, ఒక చెట్టు క్రింద నిరీక్షించి, బిడ్డను పాఠశాల సిబ్బంది అక్కడికి తీసుకొని రాగానే, సంచి లోని స్వీట్సు, ఫ్రూట్సు తీసి బిడ్డకు తినిపిస్తారా? ఆ సమయంలో మనం పెట్టే వన్నీ బిడ్డ తినాలి. అతనికి ఆకలి ఉన్నా, లేకున్నా తినాలి. బిడ్డకు ఆకలేస్తే ఏడ్చి అయినా, అడిగి అయినా తినడం వేరు. కాని, ఇక్కడ పరిస్థితి వేరు. మనం తినుబండారాలు పట్టుకు పోయినపుడే బిడ్డకు ఆకలి వేయాలి. ఇదెక్కడి విడ్డూరం? ఇవేనా బిడ్డలపై మన కున్న ప్రేమలు? ఈ ప్రేమల మధ్య నవ్వులు ఎక్కడ నిలుస్తాయి?

పూర్వపు రోజుల్లో బడులలో బిడ్డలు గాయపడినా, లేక తోటి విద్యార్థులు ఏడిపించినా, బడి నుండి రాగానే చెప్పుకోవ డానికి ఎవరో ఒకరు సిద్ధంగా ఉండేవారు. అది బిడ్డలకు ఎంత ఓదార్పు! ఇప్పు డెవరున్నారు? ఇంటిలో ముసలమ్మ లేరీ? తాతలు ఎక్కడ? అందరూ వృద్ధాశ్రమం చేరి పోయారు. ఒకవేళ, ఎక్కడన్నా ఎవరైనా మిగిలుంటే, వాళ్ళు కూడా డబ్బా ముందు కూర్చొని పిట్జా తింటూ డైలీ సీరియల్సు చూస్తున్నారు. ఓదార్చే గుంపు ఇంటి లోనే లేదు. ఇక హాస్టళ్ళలో ఉంటుందా? మరి ఓదార్చే వారెవరు? వాడికి వాడే తోడు. అందుకనే, అలాంటి ఒంటరి తోడు భరించలేక పెద్దవాడై, అవకాశము అందివస్తే, బ్లేడ్లు, కత్తులు, ఆసిడ్లతో, పబ్బులతో, క్లబ్బులతో ఓదార్పును పొందే ప్రయత్నంలో నేటి యువతీయువకులు తలమునక లవుతున్నారు. ఈ పరిస్థితికి బాధ్యు లెవరు? ఇదేనా జీవితం? ఈ విధమైన జీవితాలలో నవ్వులకు అవకాశ ముందా? ఆలోచించండి. బ్రతుకు విలువ తెలిసి బ్రతికి నపుడే బ్రతుకులో వెలుగు లుంటాయి. నవ్వు లుంటాయి. బ్రతుకు భారాన్ని మోయడం వేరు. బ్రతుకు విలువ తెలిసి జీవించడం వేరు.

**యదా ఖరః చందన భారవాహి**
**భారస్య వేత్తా న తు చందనస్య ।**

సుగంధపు చెక్కలను మోసే గాడిదకు వాటి బరువు తెలుసే గాని విలువ తెలుస్తుందా? అన్నాడు భర్తృహరి. మనకు భారాలు మాత్రమే తెలుస్తున్నాయి. మన పూర్వీకులకు విలువలు అర్థ మయ్యాయి. ఈ కారణం గానే మన బ్రతుకులు భారంగా ఉంటే, వాళ్ళ బ్రతుకులు బలంగా శోభించాయి.

మన పెద్దలు బ్రతుకు విలువ తెలిసి బ్రతికారు. కనుకనే, భగవంతుని దయకు పాత్రు లయ్యారు. బ్రతుకును భగవన్మయంగా మార్చుకున్నారు. స్వామీజీ! మన పూర్వీకులపై పరమేశ్వరుని దయ పడింది. కనుకనే వాళ్ళు అలా జీవించ గలిగారు. మాపై భగవంతుని దయ లేదేమో! అందుకనే, ఈ కాలంలో అందరూ ఇలా కలుషితమై పోతున్నారేమో! కల్మష చిత్తులుగా మారి పోతున్నారేమో! అవునా! ఈ సందేహానికి ఆధార ముందా? మనపై భగవంతుని దయ లేదా? అందుకే నవ్వలేక పోతున్నామా? ఆ విషయాన్ని కూడా విశ్లేషించు కుందాం! రేపు ఉదయం ఆరున్నర గంటలకు మూడవ ప్రవచనంలో ఇదే ప్రధాన విషయం. ఓం . . . ఓం . . . ఓం . . .





# నవ్వుతూ జీవించాలి - 3

ఆత్మబంధువులారా!

నవ్వుతూ ఆనందంగా జీవించాలని అందరమూ అభిలషిస్తున్నా, అలా జీవించలేక పోవడానికి కారణా లేమిటో పరిశీలనాత్మకంగా పరిశోధించి, ప్రతిబంధకాలను గుర్తించి, వాటిని తొలగించుకొనే దెలాగో సహేతుకంగా విశ్లేషించుకుంటూ, గడచిన రెండు ఉపన్యాసాలలో పరిష్కారాలను కొంత వరకు కనుగొన్నాం.

**మనం తెచ్చుకున్నామా?**

**ఎవరైనా తెచ్చి పెట్టారా?**

ఈ దశలో ఒక ప్రశ్న ఉద్భవించ వచ్చు. ఈ విధమైన ప్రతిబంధకాలు, నవ్వులకు అవరోధాలుగా నిలచిన ప్రతికూల పరిస్థితులు ఉండబట్టే కదా మనం సుఖంగా బ్రతకలేక పోతున్నాము! మరి, ఈ విధమైన విషమ పరిస్థితులు మన బ్రతుకులలో ఎందుకు సంక్రమించాయి? అసలు ఎలా వచ్చాయి?

వచ్చింది వాస్తవము కనుక, ఎలా వచ్చాయి? అని ప్రశ్నించుకుంటే, ఆ ప్రశ్నకు సమాధానాలు రెండు కోణాల నుండి వినిపిస్తాయి. (1) మనకు మనంగా తెచ్చుకొని ఉండాలి. లేదా, (2) మరెవరైనా ఇచ్చి ఉండాలి.

మనకు మనంగా తెచ్చుకోము అనేది నిర్వివాదాంశము. ప్రతికూల పరిస్థితుల్ని ఎవరైనా ఎందుకు వరిస్తారు? జీవితంలో దుఃఖాలు, బాధలు ఉండాలని ఎవరైనా ఎందుకు అభిలషిస్తారు? కనుక, మనకు మనంగా ఇష్టపడి వరించని ఈ స్థితిగతులు మరెవరైనా ఇచ్చి ఉంటేనే మనకు సంక్రమించి ఉండాలి.

మనం తెచ్చుకోకుండా, మరెవరైనా ఇచ్చి ఉంటే, వారు (1) కనిపించే వారా? లేక (2) కనిపించని వారా? ఎందుకంటే, మనం జన్మించడం వల్లనే ఈ బాధలన్నీ అనుభవిస్తున్నాము. అసలు పుట్టకపోయి ఉంటే ఈ బాధలే ఉండేవి కాదు అని ఆలోచించేవారు కూడా ఉన్నారు.

మనకు కనిపించేవారు, జన్మ నిచ్చిన తల్లిదండ్రులు కనుక, ఈ బాధ లన్నిటికీ తల్లిదండ్రులే బాధ్యులు అనేవారు కూడా ఉన్నారు. ఈ సందర్భంలో ఒక్క విషయాన్ని మీకు చెప్పడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను. తల్లిదండ్రులను మాత్రం పొరపాటున కూడా దూషించకండి. గురుపూర్ణిమ పర్వదిన సందర్భమున నా శిష్యు లందరు గుర్వాజ్ఞగా దీనిని స్వీకరించండి.

**మాతాపితలు నిమిత్తం**

మనకు జన్మ నిచ్చిన వారు తల్లిదండ్రులే అయినా, మన జన్మకు వారు నిమిత్తమే

గాని నియంతలు కారు. ఆ విషయములో వారు అమాయకు లనే చెప్పాలి. ఒక విధంగా చూస్తే, వారు వడ్డనకు ఉపయోగపడే గరిటె లాంటి వారు.

వండిన పదార్థాన్ని వడ్డించడానికి గరిటె ఉపయోగ పడుతుంది. వంట చేయడం వేరు. వడ్డించడం వేరు. వంట రుచికరంగా ఉన్నా, లేదా అరుచిగా ఉన్నా, అది వంట చేసిన వారికి సంబంధించిన విషయమే గాని గరిటెకు సంబంధించిన విషయం కాదు. అందులో తోషమైనా, దోషమైనా గరిటెకు సంబంధము లేదు. జన్మ విషయంలో తల్లిదండ్రులు గరిటె లాంటి వారు. రుచులు గరిటెకు తెలియవు. తల్లిదండ్రులకు జన్మ విశేషాలు, జీవి రహస్యాలు అర్థం కావు.

వారికి అవన్నీ అర్థమయ్యే టట్లయితే, పోలియో వ్యాధి గ్రస్తులైన బిడ్డల్ని ప్రసవిస్తారా? గుండెలో చిల్లులున్న శిశువులకు జన్మ నిస్తారా? సంతానం సౌభాగ్యంగా భావించే తల్లిదండ్రులు నిర్భాగ్యులను కంటారా?

బిడ్డల పుట్టుకకు తల్లిదండ్రులు నిమిత్తమే గాని, నియంతలు కారు. బిడ్డల పుట్టు పూర్వోత్తరాలు తల్లిదండ్రులకు అర్థం కావు. వారి ప్రమేయం లేకుండానే వాళ్ళు మన జన్మకు నిమిత్త మయ్యారు. అయినా, వాళ్ళున్న చోటనే మనల్ని పెంచారు. వాళ్ళ కున్నదే మనకు ఇచ్చారు. వాళ్ళు తిన్నదే మనకు పెట్టారు. వాళ్ళ జీవితాలే వాళ్ళకు భారంగా ఉండే టప్పుడు మన భారాలను దించడములో వాళ్ళు అశక్తులే కావచ్చు. అసమర్థులే కావచ్చు. అంతమాత్రాన మన బాధలకు తల్లిదండ్రులను దోషులుగా నిలబెట్టడం భావ్యం కాదు. మహా పాపం. అందుకే అంటున్నాను తల్లిదండ్రులను ఎట్టి పరిస్థితుల లోను దూషించ వద్దని. వారు ఏమీ మనకు ఇవ్వలేక పోయినా, వారు ఇచ్చిందేమిటో అర్థమైతే, వారు ప్రాతః స్మరణీయులుగా మన గుండెలలో పదిలంగా ఉండి పోతారు.

**మాతాపితలు**

**ప్రాతఃస్మరణీయులు**

తల్లిదండ్రులు మనకు జన్మ నిచ్చారు. దేహాన్ని ప్రసాదించారు. నేడు నా ప్రవచనాలను మీరు ఆనందంగా శ్రవణం చేస్తున్నారు. శ్రవణం చేయడానికి మీకు చెవు లున్నాయి. ఆ చెవులు దేహం లోనే ఉన్నాయి. దేహం తల్లిదండ్రులు ఇస్తేనే వచ్చింది. వాళ్ళ ఋణాన్ని మీరు తీర్చుకోగలరా?

దేహం ఉంటేనే కదా మనం కర్మల నాచరించ గలుగుతాము! ధర్మాచరణమునకు, ధర్మ జీవనమునకు దేహమే కదా సాధనము! అందుచేతనే, **శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్** అని కాళిదాసు మహాకవి కుమార సంభవము అనే మహాకావ్యంలో అన్నారు.

పుణ్య కార్యాలను ఆచరించుటకు ఉపకరించే మానవ దేహము పుణ్యఫలం గానే ప్రాప్తించింది. పవిత్రమైన సాధనలను ఆచరించుటకు ఉపకరించుట చేత శరీరము పవిత్ర మైంది. అనేక జన్మలలో ఆచరించిన పుణ్యఫల విశేషంగా ప్రాప్తిస్తుంది మానవ శరీరము.



అందుచేతనే జన్మాంతర పాపాలను పోగొట్టే శక్తి కలదై ఉంటుంది. కనుకనే, **దేహో దేవాలయః ప్రోక్తః** - దేహమును దేవాలయంతో పోల్చారు మన పెద్దలు.

దేవాలయాలకు దైవ దర్శనార్థం వెళ్ళినపుడు ఆలయం చుట్టు మూడు సార్లు ప్రదక్షిణలు చేస్తాం. దేవునికి నిలయమైన ఆలయము చుట్టు ప్రదక్షిణలు చేస్తే పాపం ప్రక్షాళన మౌతుందని భావిస్తాము.

ఆలయానికి వెళ్ళలేని వారు ఇంటి లోనే పూజాగదిలో భగవంతుని అర్చించి నపుడు, పూజ కాగానే, దేవాలయం చుట్టూ ఎలాగైతే మూడు సార్లు ప్రదక్షిణము చేస్తారో, అలాగే తమ దేహం చుట్టే తాము మూడుసార్లు ప్రదక్షిణం చేసి పాపవిముక్తు లైనట్లు భావిస్తారు.

**యాని కానిచ పాపాని జన్మాంతర కృతాని చ ।**
**తాని తాని వినశ్యన్తి ప్రదక్షిణ పదే పదే ॥**

'ఈ జన్మలో నా చేత ఏ ఏ పాపాలు ఆచరింప బడినవో **(యాని కాని చ పాపాని)**, వాటితో పాటు గత జన్మలలో నా చేత ఆచరింపబడి ఏ ఏ పాపాలు ప్రారబ్ధం రూపంలో నాతో కలిసి పుట్టినవో **(జన్మాంతర కృతాని చ)**, నేడు ప్రతికూల పరిస్థితుల రూపంలో నన్ను బాధించు చున్నవో, అవన్నియు **(తాని తాని)** భగవాన్! నేను నీకు చేసే ప్రదక్షిణ నమస్కారములలో **(ప్రదక్షిణ)** అడుగడుగుకు **(పదే పదే)** నశించి పోతున్నాయి **(వినశ్యన్తి)** అని దైవానికి నిలయమైన దేహం చుట్టూ మూడు సార్లు ప్రదక్షిణం చేస్తాము. అందుకనే, దేహమే దేవాలయ మన్నారు. అట్టి దేవాలయాన్ని మనకు ప్రసాదించిన తల్లిదండ్రులు ప్రాతఃస్మరణీయులు కారా?

ఈ సత్యాలను గ్రహించక, మన జీవితాలలో అస్తవ్యస్త పరిస్థితులను అర్థం చేసుకోవడంలో అశక్తులమై తల్లిదండ్రులను బాధ్యులుగా భావించి వారిని నిందిస్తే, మరి తల్లిదండ్రులు వారి పరిస్థితులకు ఎవరిని నిందించాలి? వారి తల్లిదండ్రులను నిందించాలి. మరి, వాళ్ళెవరిని నిందించాలి? ఇలా చెప్పుకుంటూ పోతే అదేదో పూడిక తెలియని అగాధంలో నిలబడేందుకు చేసే ప్రయత్నంలా ఉంటుంది. ఆలోచించండి. దురదృష్టకర మైన నిర్ణయాలను జీవితంలో ఎప్పుడూ తీసుకోకూడదు. మనం మన బ్రతుకులలో తీసుకొనే నిర్ణయాలే మన బ్రతుకు గమ్యాన్ని నిర్దేశిస్తాయి.

**దైవం కారణమా?**

మన జన్మకు కనిపించే తల్లిదండ్రులు నిమిత్తంగా అర్థమయ్యారు. అంతే కాదు. మన జన్మ లోని అస్తవ్యస్త పరిస్థితులకు వారు కారణం కాదని కూడా అర్థమయింది. బ్రతుకు రావడానికి నిమిత్త మయ్యారే గాని, బాధలకు తల్లిదండ్రులు కారణం కాదని, వారు నిర్దోషులని తేలి పోయింది.

కనిపించే తల్లిదండ్రులు బాధలను ఇచ్చేవారు కానపుడు, మరి ఎవరిచ్చారు? కనిపించని నియంత, పరమేశ్వరుడు ఇచ్చి ఉండాలి. ఇది వాస్తవ మేనా? సరే మన

దుఃఖానికి భగవంతుడు కారణము అని ప్రస్తుతానికి అనుకుందాం. మరి, జీవితంలో మనం సుఖపడిన క్షణాలే లేవా? మరి, వాటికి ఎవరు కారణము? ఇంతకీ భగవంతుడు సుఖా న్నిచ్చేవాడా? దుఃఖాన్నిచ్చే వాడా? నీరు, నిప్పు ఒకే చోట కలిసి మనుగడను ఎలా సాగిస్తాయి? చీకటి వెలుగులు ఒకే ప్రదేశంలో ఎలా మన గలుగుతాయి? ఆలోచించండి.

మన బ్రతుకుల లోని బాధలకు తల్లిదండ్రులు ఎలా కారణం కారో, అలాగే భగవంతుడు కూడా కారణం కాదు. మరెవరు కారణం? నీవే. నీ ఆలోచనా విధానమే కారణము. గతంలో నీవు ఆచరించిన కర్మలే కారణం. నీ మనస్సే కారణం. అందుచేతనే,

**మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః**

మానవుల బంధమోక్షాలకు మనస్సే కారణము అని తేల్చి చెప్పింది ఉపనిషత్తు. అసలు కారణాన్ని విస్మరించి, నిష్కారణమైన వాళ్ళను కారణాలుగా గుర్తించి, నిర్దోషులను దోషులుగా పరిగణించి, ఆ మార్గంలో ఆలోచనలు సాగించేవారు నవ్వే దెలా? నవ్వుతూ జీవించే దెలా? ఇక్కడే పరిస్థితులు తారుమా రవుతున్నాయి. నవ్వులు మాయ మవుతున్నాయి. ఏడుపులే వినిపిస్తున్నాయి.

అందుకే అంటున్నాను. జీవితంలో మనం తీసుకొనే నిర్ణయాలే మన బ్రతుకులను శాసిస్తాయి అని. ఏ విషయంలో నైనా, ఎంత కాలమైనా నువ్వు ఆలోచించుకో వచ్చు. కాని, నిర్ణయాలు మాత్రం సక్రమంగా ఉండాలి. సక్రమమైన నిర్ణయాలు సద్గతిని ప్రసాదిస్తాయి. నిర్ణయాలు సక్రమంగా లేకపోతే, బ్రతుకు బండి సక్రమమైన మార్గంలో పయనించదు.

కనుక మనం తీసుకొనే నిర్ణయాలే బ్రతుకులో ప్రధాన భూమికను పోషిస్తాయి. నిర్ణయాలను తీసుకోవడంలో బుద్ధి శక్తివంతమై ఉండాలి. పుష్టికరంగా ఉండాలి. అప్పుడే సక్రమమైన నిర్ణయాలు తీసుకోగలం. నిర్ణయాలు సక్రమంగా లేకపోతే, అవి ప్రగతికి ప్రతిబంధకా లవుతాయి. వ్యక్తిలో క్రియాశీలత లోపిస్తుంది. ఆధ్యాత్మికంగా ముందుకు వెళ్ళ లేడు. నవ్వుల్ని పారేసుకుంటాడు.

## నిర్ణయాల ప్రాముఖ్యం

జీవితంలో నిర్ణయాల ప్రాముఖ్యాన్ని అర్థం చేసుకోవాలి. గుర్తించాలి. గతంలో సరియైన నిర్ణయాలు తీసుకోలేక గాడి తప్పి నడక సాగించాం. అశాంతి కుటీరంలో మకాం పెట్టాం. నవ్వుల్ని దూరం చేసుకున్నాం. సరియైన నిర్ణయాలు తీసుకోలేక గతంలో బ్రతుకును, బుద్ధిని పాడు చేసుకున్న మనం ఇప్పుడు సరియైన నిర్ణయాలను తీసుకొని బుద్ధిని సరి చేసుకోవాలి. బ్రతుకును సరిదిద్దు కోవాలి. అప్పుడే పోయిన నవ్వులు తిరిగి మన బ్రతుకుల లోకి ప్రవేశిస్తాయి.

నిర్ణయాల విషయంలో ప్రధానంగా రెండు విషయాలను అర్థం చేసుకోవాలి. ఒకటి, మనం తీసుకొనే నిర్ణయం సరియైనదై ఉండాలి. రెండు, నిర్ణయం తీసుకున్న తరువాత ఆచరణలో వెనుకడుగు వేయ కూడదు. ఫలం చేతి కందినంత వరకు దీక్ష అకుంఠితంగా



ఉండాలి. ఈ విషయంలో సిద్ధార్థుడు సర్వులకు ఆదర్శము. ఈ ఒక్క విషయంలో బుద్ధుడే నా హృదయంలో ప్రథమ స్థానాన్ని ఆక్రమిస్తాడు. ఆ తరువాత, రెండవ స్థానం స్వామి రామతీర్థది.

## సిద్ధార్థుని కఠోర నిర్ణయం

శుద్ధోధన మహారాజు కుమారుడు సిద్ధార్థుడు. రాజ సింహాసనము తన కొరకు నిరీక్షిస్తూ ఉంది. ఒక వైపు అందమైన అర్ధాంగి, మరో వైపు ముద్దు లొలికే సుపుత్రుడు. అతనికి ఏమి తక్కువ? ఒకనాడు మార్గ మధ్యంలో ఒక రోగిని, ఒక ముదుసలిని, ఒక శవాన్ని, ఒక సన్యాసిని చూచాడు. మనస్సు కల్లోల మైంది. బుద్ధి విచలిత మైంది. హృదయంలో వైరాగ్య జ్వాల ప్రదీప్తమైంది. సత్యాన్వేషణకు సిద్ధపడ్డాడు సిద్ధార్థుడు. గయకు చేరాడు. బోధి వృక్షము క్రింద ఆసీన మయ్యాడు. మెల్లగా కళ్ళు మూసాడు. బుద్ధిలో తనకు తాను కఠోర నిర్ణయం తీసుకున్నాడు.

**ఇహాసనే శుష్యతు మే శరీరం**
**త్వగస్థి మాంసం విలయం చ యాతు ।**
**అప్రాప్య బోధిం బహుకల్ప దుర్లభాం**
**నైవాసనాత్ కాయ మతః చలిష్యతే ॥**

ఇది సిద్ధార్థుని కఠోర నిర్ణయం. ఈ ఆసనం లోనే (**ఇహాసనే**) నా శరీరము (**మే శరీరం**) శుష్కించి పోనీ గాక! (**శుష్యతు**). నా దేహం లోని చర్మము (**త్వక్**), ఎముకలు (**అస్థి**), మాంసము (**మాంసం**) మట్టిలో కలిసిపోనీ గాక! ధూళిలో ధూళిగా చేరిపోనీ గాక! (**విలయం చ యాతు**). అనేక యుగాలలో, కల్పాలలో యత్నించినా సాధ్యము కాని (**బహుకల్ప దుర్లభాం**) జ్ఞానమును లేదా సత్యమును (**బోధిం**) పొందకుండా (**అప్రాప్య**), ప్రస్తుతము నేను కూర్చొనియున్న ఈ ఆసనము నుండి (**ఆసనాత్**) నా దేహము (**కాయం**) చలించనే చలించదు (**న చలిష్యతే**). ఆహా! ఏమి నిర్ణయం! ఎంత కఠోరమైన నిర్ణయం! నిర్ణయం తీసుకోవడమే కాదు. దానిని ఆచరించుటలో ఎక్కడా రాజీ పడలేదు. తన నిర్ణయానికి తాను కట్టుబడి పోయాడు. అదే ఆసనంలో పన్నెండు సంవత్సరాలు చలించకుండా ఉండి పోయాడు. ఇక్కడే సిద్ధార్థుడు బుద్ధు డయ్యాడు.

(1) దృఢమైన నిర్ణయం తీసుకో గలగాలి (2) ఆ తరువాత సుదృఢవ్రతుడై నిర్ణయాన్ని మరో ఆలోచన లేకుండా అమలు పెట్ట గలగాలి. అట్టి వారే ఆధ్యాత్మిక మార్గంలో అనుకున్నది సాధించ గలరు. సంతోషంతో, ఆనందంగా నవ్వుతూ జీవించ గలరు.

అందుచేతనే, మన సంప్రదాయంలో ఉపనయన సంస్కారము చేసేటప్పుడు గాయత్రీ మంత్రమును ఉపదేశిస్తారు. ఉపనయనము జరిగే దశ జీవితములో చాలా కీలక మైనది. ఆ దశ నుండే బుద్ధి ఆలోచనలను తీవ్రంగా కదిలిస్తుంది. ఆ దశలో తీసుకొనే నిర్ణయాలు శక్తివంతంగా, పుష్టివంతంగా ఉండాలి. అలాంటి నిర్ణయాలు తీసుకొనే శక్తి బుద్ధికి ఉండాలి.

అదే ధీశక్తి. కనుక బుద్ధి ప్రకాశవంతంగా ఉండి, సరియైన నిర్ణయాలు తీసుకొనే విధంగా ఉండేందుకు బుద్ధి వికసనానికి గాయత్రీ మంత్రమును బ్రహ్మచారులు జపించేటట్టు మంత్రదీక్షను పెద్దలు అనుగ్రహించే వారు.

***గాయత్రీ మంత్ర వైభవము***

**ఓం భూ ర్భువః స్వః త త్సవితు ర్వరేణ్యం**
**భర్గో దేవస్య ధీమహి । ధియో యో నః**
**ప్రచోదయాత్ ।**

ఇది గాయత్రీ మంత్రము. గాయత్రి అనేది మంత్రము యొక్క పేరు. గాయత్రి అనేది ఛందస్సు కూడా. ఈ మంత్రము గాయత్రీ ఛందస్సులో ఉండటము కూడా విశేషము. గాయత్రిని వేదంలో సావిత్రి అని కూడా పిలుస్తారు. ఈ మంత్రమునకు విశ్వామిత్ర మహర్షి మంత్రద్రష్ట.

**ఓం భూర్భువః స్వః** – ఓంకారము భగవంతుని వాచకము. భగవంతుడు వాచ్యము. ఓంకారము వాచకము. ఇది అభిధేయ అభిధాన సంబంధము. భగవంతుడు అభిధేయము. ఓంకారము అభిధానము. ఓంకారము అనేది భగవంతుని పేరు (**తస్య వాచకః ప్రణవః**).

ఈ సమస్త ప్రపంచమూ సర్వేశ్వరుడే. కనుక సమస్తమూ ఓంకారమే. **ఓ మిత్యేత దక్షర మిదగ్ం సర్వమ్** – ఈ సమస్త ప్రపంచమూ ఓంకారమే. అలాగే **భూర్భువః స్వః** – అనేది ఓంకారము యొక్క విస్పష్ట వివరణము. భూలోకము, భువర్లోకము, సువర్లోకము అంతయూ ఓంకారమే. **భూః** – అంటే భూ లోకము. **భువః** – అంటే భువర్లోకము, అంటే భూమికి ఊర్ధ్వంగా ఉన్న లోకాలన్నీ **భువః** క్రిందికి వస్తాయి. అలాగే **సువః** అంటే అధోలోకాలు. పైన ఏడు లోకాలు, క్రింద ఏడు లోకాలు కలిసి **భూర్భువః స్వః** – అదే ఓంకారము. అభిధేయమైన బ్రహ్మమునకు అభిధానము.

**'భూః'** అంటే ఆధారము అని కూడా అర్థము (**భూః ఆధారః**). **'భువః'** అంటే, భూమికి కూడా ఆధారమైన భగవానుడు అని భావము. సర్వ భూతములకు ఆధారమైన భూమి తానే. అంతేకాదు. భూమికి ఆధారమైన వాడు కూడా తానే కనుక **భూర్భువః** అని భగవానుడు స్తుతింప బడినాడు (**భువః అపి భూః**). కనుకనే విష్ణుసహస్రనామం జగదీశ్వరుని **భూర్భువః** అని కీర్తించింది (నామం 942). **'భూర్భువః స్వః'** అనేది ఓంకారము యొక్క వివరణమే. అదే పరమాత్మ స్వరూపము. **తత్** – ఆ భగవత్స్వరూపము **వరేణ్యం. వరేణ్యం** అంటే పూజనీయ మైనది. అట్టి ఓంకార స్వరూపుడైన పరమేశ్వరుని మేము ధ్యానించు చున్నాము (**ధీమహి**). ఆ స్వరూపమే సూర్యుని యందు శోభించు ప్రకాశము. **సవితుః** అంటే ప్రత్యక్ష దైవమైన సూర్య భగవానుడు. సూర్యుడు ఎలాగైతే అంధకారమును నశింప చేస్తాడో అలాగే మనలోని అజ్ఞానమును నశింప చేయువాడు భర్గుడు (**భర్గః**). భర్జనము చేయువాడు భర్గుడు (శివసహస్రనామం).



కనుక అట్టి భర్గుడు మా బుద్ధులను ప్రకాశింప చేయుగాక! అనేది ప్రార్థన. **భర్గో దేవస్య ధీమహి – ధియో యో నః ప్రచోదయాత్** అంటే నః – మా యొక్క **ధియః** – బుద్ధులను, **ప్రచోదయాత్** – ప్రకాశింప చేయుగాక! (**ప్రచోదనం కుర్యాత్**)! అంటే, బుద్ధిని సరిచేయు గాక అని అర్థం. బుద్ధి సరిపడితే, ఆలోచనలు దీప్తిమంత మవుతాయి. నిర్ణయాలు దివ్యంగా ఉంటాయి. అందుకే గాయత్రీ మంత్రజపము.

ఈ విధమైన సాధనల ద్వారా మన బుద్ధులు శుద్ధి పడినపుడు భగవంతుడు ఏమిటో, భగవంతునితో మన కుండే సంబంధము ఎలాంటిదో, ఆయన దయ సదా మనపై ఎలా వర్షించి యుందో అవగత మవుతుంది. అప్పుడే భక్తి వృద్ధి చెందుతుంది. బ్రతుకు భగవన్మయమై ఆనంద దాయకంగా ఉంటుంది. అలాంటి స్థితిలో మనకు ఏం మిగుల్తాయి నవ్వులు తప్ప? ఆలోచించండి!

***భగవంతుడు దయా స్వరూపుడు***

భగవంతుడు దయామయుడు అనడం వేరు. ఎలా దయామయుడో తెలిసి రావడం వేరు. ఏదో చేస్తే మనం భగవంతుని దయను చూస్తాము అని భక్తులలో అధిక శాతం అభిప్రాయ పడుతున్నారు. అంతేగాని, భగవంతుని దయ ఎప్పుడూ మనపై వర్షిస్తూనే ఉంది. ఇప్పుడు కూడా ఉంది అని గ్రహించలేక పోతున్నారు.

ఒక వ్యక్తి టెలివిజన్ చూస్తూ వార్తలు వింటున్నాడు. ఈ లోగా తనకు దగ్గరగా నేల మీద దోగాడుతున్న తన బిడ్డడు అలికిడి చేశాడు. తండ్రి పిల్లవాని వైపు చూశాడు. పిల్లవాడు బోసి నవ్వును చిందించాడు. తండ్రి కూడా నవ్వుతూ తల ఊపి, ఆ తరువాత మళ్ళీ టెలివిజన్ చూడటం ఆరంభించాడు.

ఈ లోగా టి.వి.లో బ్రేకింగ్ న్యూస్ వచ్చింది. ఎక్కడో ఒక బాలుణ్ణి దుండగులు అపహరించుకొని పోయారు అనేది వార్త. అపహరించ బడిన బిడ్డ ఫోటో టి.వి. తెరపై కనపడుతోంది. ఆ పిల్లవాడు తన ముందు దోగాడుతున్న తన కుమారుని లాగే ఉన్నాడు. అదే వయస్సు. అంతే. టి.వి. చూస్తున్న తండ్రి తన దృష్టిని వెంటనే తన బిడ్డ వైపు సారించాడు. బిడ్డ మళ్ళీ అమాయకంగా బోసినవ్వును చిందించాడు. ఆ బోసి నవ్వును ఇంతకు ముందు కూడా తండ్రి చూశాడు. కాని, ఇప్పుడు ఆ నవ్వులో పరమాత్మను దర్శిస్తున్నాడు. భగవంతుని దయను చూస్తున్నాడు.

హే భగవాన్! అక్కడ బిడ్డ అపహరింప బడ్డాడు. అదే వయస్సు గల నా బిడ్డ నా ముందు నవ్వుతూ ఆడుకుంటున్నాడు. ఒకవేళ, నా బిడ్డే కిడ్నాప్‌కి గురై ఉంటే! – ఆ ఆలోచనను క్షణం కూడా భరించలేక పోయాడు. తండ్రీ! నా బిడ్డ నా కళ్ళ ముందు ఉన్నాడు అంటే, ఇది కేవలం నీ దయ, నీ కృప, నీ అనుగ్రహం అంటూ కళ్ళను తడుపుకొని, బిడ్డను ఎత్తుకొని ముద్దుల వర్షం కురిపిస్తున్నాడు. చూశారా? దయను గుర్తించి నపుడే హృదయాలు ద్రవిస్తాయి. ఇలా ఎన్నయినా చెప్పవచ్చు. దయను గుర్తించడమే ముఖ్యం.

## అనుగ్రహము

### అనుగ్రహ స్పృహ

భగవంతుని దయ మనపై సదా వర్షిస్తూనే ఉంది. నిరంతరము మనకు తోడు గానే ఉంది. దయ లేకపోలేదు. కాని, ఉన్న దయను గుర్తించలేక పోవడం చేత ఉన్న దయ లేనట్లు అనిపిస్తూ ఉంది. ఇప్పుడు మనకు కావలసింది భగవంతుని దయ కాదు. ఉన్న దయను గుర్తించే స్పృహ. మన పూర్వీకులలో ఈ స్పృహ పూర్ణంగా ఉండేది. అందుచేత వాళ్ళు హాయిగా, ఆనందంగా నవ్వుతూ జీవించ గలిగారు.

ఈ రోజుల్లో ఎంత కాలుష్యం విరజిమ్మ బడుతూ ఉందో మనం కళ్ళారా చూస్తూనే ఉన్నాం. ఆ కాలుష్యం బారిన పడి ఎందరో జీవితాలు రోగాలతో కృంగి పోతున్నాయి. అలాంటి కాలుష్య వాతావరణం లోనే మనమూ చరిస్తున్నాం. కాని, రోగాల వాత పడకుండా ఆరోగ్యంగా ఉన్నామంటే, అది భగవంతుని దయ కాదా? చెప్పండి. మనకు భగవంతుని దయ లేదా? లేక మనం గుర్తించడం లేదా? ఆలోచించండి.

ప్రతిరోజు రహదారిపై ఎన్నో ప్రమాదాలు జరుగుతున్నాయి. మన వాహనం కూడా రోజూ రహదారి పైనే పయనిస్తూ ఉంది. అయినా, ఇంతవరకు మనం ఏ ప్రమాదానికి గురి కాలేదు. ఇది భగవంతుని కృప కాదా? క్లబ్బులు, పబ్బులు అంటూ యువత పెడదారి పడుతున్న ఈ రోజుల్లో మన బిడ్డలు ఆ వైపు వెళ్ళకుండా బుద్ధిగా చదువుకుంటున్నారు అంటే అది భగవంతుని కృప కాదా?

మనలో గుండె అనే ప్రధాన అవయవము ఒకటి ఉంది కదా? అది నిరంతరము విశ్రాంతి లేకుండా పని చేస్తూ ఉంది అని మనకు తెలుసు కదా? అది ఆడుతూ ఉంటేనే మనం జీవించి ఉండగలం. అది కొట్టడం మానేస్తే మనకు, ఈ ప్రపంచానికి ఋణం తీరి పోతుంది. అలా గుండె ఏదో ఓనాడు ఒక్క క్షణంలో ఆగి పోతుంది. ఆ క్షణ మేదో మనకు తెలుసా? ఎప్పుడైనా ఆగిపోవచ్చు. అయినా, ఈ రోజు ఆ విధమైన భయమే లేకుండా నిర్భయంగా జీవించ గలుగుతున్నా మంటే, మనల్ని భగవానుని అభయ హస్తము రక్షించడం కాదా! ఆలోచించండి.

చీకటి పడితే చాలు. ఎవరి ఇంటిలో దోపిడి దొంగలు ప్రవేశిస్తారో తెలియదు. చీకటి లోనే కాదు, పగటి పూట కూడా విచ్చలవిడిగా దోపిడీలు జరుగుతున్న సమాజంలో మనం సురక్షితంగా ఉన్నామంటే, అది భగవంతుని దయ కాదా? ఈ దయ మీద విశ్వాసంతో కాదా మనం బ్రతికేది? ఆలోచించండి.

మన ప్రయత్నం లేకుండానే మనలో శ్వాసలు నడుస్తున్నాయి. అనుక్షణం గాలిని పీల్చుతూ, వదులుతూ బ్రతుకుతున్నాం. గాలి పీల్చకుండా నిమిషం కూడా బ్రతకలేము. అయినా, ఇంతటి అద్భుతమైన శ్వాసక్రియ మన ప్రమేయమే లేకుండా నడుస్తూ ఉంది. మరి, ఎవరి ప్రమేయంతో నడుస్తూ ఉందో ఏ క్షణమైనా ఆలోచించామా? ఆలోచిస్తే అర్థ



మౌతుంది. అర్థమైతే గుర్తించ గలుగుతాము. ఏమని? అనుక్షణము భగవంతుని కృపే మనల్ని బ్రతికిస్తూ ఉందని.

గాలి పీల్చేది క్షణాలే. గాలి విడిచేదీ క్షణాల్లోనే. గాలి పీల్చడం శాశ్వతంగా ఆగి పోయేది ఒకే క్షణం. అయినా, రోజులు, వారాలు, మాసాలు, సంవత్సరాలు శ్వాసలు ఆగకుండా సాగుతున్నాయంటే, అది భగవంతుని దయ కాదా?

ఈ విధంగా సదా మనం అనుభవిస్తున్న దయను గుర్తించగనే, మనలో శ్రద్ధా భక్తులు ఇనుమడిస్తాయి. శ్రద్ధ ఎంతగా పెరుగుతూ ఉంటే భగవంతుణ్ణి అంతగా అర్థం చేసుకుంటాము. భగవంతుణ్ణి ఎంతగా అర్థం చేసుకుంటే అంతగా మన బ్రతుకులు భగవన్మయ మవుతాయి. బ్రతుకులో దైవస్పృహ పెరిగింది అంటే జీవితం ఆనందంతో పరవశిస్తుంది. అట్టి జీవితాలలో నవ్వులు అప్రయత్నంగా విరబూస్తాయి.

### శ్రద్ధావాన్ లభతే జ్ఞానం

ప్రతి పువ్వులో మకరందం ఉంటుంది. ఎంత చెట్టుకు అంత గాలి అన్నట్లు, ఏ పువ్వుకు ఉండ వలసిన తేనె ఆ పువ్వులో ఉంటుంది. ఏ కారణం చేత నైనా పువ్వు లోని తేనె ఇంకిపోతే, దాని నుండి కాయ రాదు. వచ్చినా ఫలప్రదం కాదు.

పుష్పమును మనం సృష్టించ లేదు. పుష్పములో మధువును ఉంచింది మనం కాదు. పుష్పాన్ని ఆఘ్రాణించడమే మనకు తెలుసు. ఫలములను అనుభవించడమే మనకు తెలుసు. పుష్పమును సృష్టించిన భగవానుడే పుష్పములో మధువును ఉంచాడు. ఆ మధువు చేతనే కాయ పెరుగుతుంది అనే నియతిని ఏర్పరచిన వాడు కూడా భగవంతుడే.

కుసుమంలో మధువు ఉన్నట్లే మన హృదయ కుసుమాలలో శ్రద్ధ ఉండాలి. మధువు నుండే కాయ ఆవిర్భవించి, అది పక్వమై ఫల రూపాన్ని ధరించినట్లు, మన లోని శ్రద్ధ చేతనే సాధన అనే కాయ పెరిగి, పరిపక్వమై జ్ఞానఫలమును అందిస్తుంది.

శ్రద్ధ ఎంత దృఢంగా ఉంటే భక్తి అంత దృఢంగా ఉంటుంది. భక్తి దృఢంగా ఉంటే బ్రతుకు దివ్యంగా శోభిస్తుంది. అశాంతి ఉండదు. దుఃఖం దరి చేరదు. నిరాశా నిస్పృహలు తలెత్తవు. నవ్వులు సదా విరబూస్తూనే ఉంటాయి. ఇదంతా భగవంతుని దయ చేతనే సాధ్య మవుతుంది. మన అవసరాలన్నీ మన కన్నా భగవంతునికే బాగా తెలుసు.

మన బాధల్ని మనం పదే పదే వినిపించినా ఇతరులకు అర్థం కాదు. కాని, మనం చెప్పక పోయినా భగవంతుడికి మన బాధలన్నీ తెలుసు. మనుషులకు తెలిసినా, వాటిని నివారించడంలో వారు అశక్తులు. కాని, భగవంతుడు సర్వజ్ఞుడు. సర్వ శక్తిమంతుడు. ఆయనకు అసాధ్య మంటూ లేదు. అట్టి భగవంతుని యందు శ్రద్ధ కలిగి, భక్తి చేస్తే, ఆయనతో మన సంబంధం ధ్రువ పడుతుంది. బ్రతుకు ఆనందంతో విరాజిల్లుతుంది.

**వినేవాడు విష్ణుదేవుడు**

**విన్నపాలు వినిపించు**

మనకు బాధ లున్నాయి. ఆవేదన లున్నాయి. తీరని కష్టా లున్నాయి. అవన్నీ ఇతరులకు వినిపిస్తాము. ఆదుకుంటారేమో నని ఆశిస్తాము. నిజమే. ప్రవాహంలో కొట్టుకు పోయేవాడు గడ్డిపోచ దొరికినా, దానిని పట్టుకొని గట్టున పడాలని ప్రయత్నిస్తాడు. తప్పు లేదు. కాని, ఇక్కడ అర్థం కావలసింది ఒక్కటే. మనం ఆశ్రయించినంత మాత్రాన మనల్ని ఆదుకొని ఒడ్డున పడేసే శక్తి గడ్డిపోచకు లేదు. అంతేకాదు. ఆ గడ్డిపోచ కూడా మనతో పాటే ప్రవాహంలో కొట్టుకుపోతూ ఉంది. అది మనల్ని ఏమి రక్షించ గలదు?

ఈ ప్రపంచంలో ఎవరైనా అంతే. మన బాధల్ని అందరూ వింటారు. తీర్చే శక్తి ఎవరి కుంది? మనం పోగొట్టుకున్న నవ్వుల్ని తిరిగి తెచ్చి ఇచ్చే శక్తి ఎవరి కుంది? ఎవరి కున్నా సరే, అట్టి వారికి వినిపించి నపుడే మన విన్నపాలు ఫలిస్తాయి. అట్టి శక్తి గల వాడు భగవంతు డొక్కడే.

నువ్వు వినిపించక పోయినా అంతర్యామి యైన భగవంతునికి నీ బాధలన్నీ తెలుసు. కాని, వినిపిస్తే భక్తి మరీ దృఢ పడుతుంది. భగవంతునికి నీ మొర ఎలా వినిపించాలో నీకు అర్థం కావాలి. భక్తిలో ఇది చాలా ప్రధానమైన విషయం. భగవంతుని పొందడానికి ఇదొక అందమైన మార్గం. భగవంతునితో భాషించడము (**తదేవ భాషయతి**), ఏది వినినా అది భగవద్వాణిగా ఆలకించడము (**తదేవ శృణోతి**), అన్నిటిలో పరమేశ్వరుని వైభవమును దర్శిస్తూ జీవించడము (**తదేవ అవలోకయతి**) – ఇది చాలా ప్రధానమైన విషయం. ఈ అభ్యాసము భగవంతుని అనుస్మరిస్తూ బ్రతికే దివ్య జీవనానికి నాంది పలుకుతుంది. ఇదే ప్రార్థనా వైశిష్ట్యము. స్మరణ వైభవము.

**తస్మాత్ సర్వేషు కాలేషు మా మనుస్మర యుధ్య చ ।**
**మయ్యర్పిత మనోబుద్ధిః మామే వైష్య స్య సంశయః ॥**

'అర్జునా! సర్వ కాలముల లోను నన్నే స్మరించు. స్మరిస్తూనే నీ యుద్ధ కార్యాన్ని ఆచరించు (**యుధ్య చ, యథా శాస్త్రం యుధ్య చ యుద్ధం చ స్వధర్మం కురు**). యుద్ధం అర్జునుని స్వధర్మము. అలాగే ఎవరి ధర్మాన్ని, ఎవరి కర్తవ్యాన్ని వారు ఆచరిస్తూ ఉండాలి. ధర్మ నిర్వహణలో దైవ స్మరణము దూరం కాకుండా చూసుకోవాలి. అలా చేయ గలిగితే, మన మనోబుద్ధులను భగవంతునికి అర్పణ చేశామని భావము. అదే జరిగితే, మనం తప్పక భగవంతుని పొందుతాము. ఈ విషయంలో సందేహం లేదు అని భగవానుడు, గీత – 8 వ అధ్యాయములో భేరీ నినాదంతో వినిపిస్తున్నాడు (**మయి వాసుదేవే అర్పితే మనోబుద్ధీ యస్య తవ సః త్వం మయ్యర్పిత మనోబుద్ధిః సన్ మామేవ యథా స్మృతమ్, ఏష్యసి అగమిష్యసి, అసంశయః న సంశయః అత్ర విద్యతే**). ఈ విధంగా మన నిత్య కర్మలలో,



నిరంతర కార్యకలాపాలలో మనుషుల మధ్యే మెలుగుతున్నా భగవంతునితో కలిసి జీవించడ మెలాగో అర్థం చేసుకొని, తదనుగుణంగా ఆచరిస్తే బ్రతుకులో నవ్వులు దూరం కావు.

**మనుషుల తోనే మాట్లాడు**

**మాధవునికి వినిపించు**

నీకు చెవు లున్నాయి; నీ మిత్రుడికి చెవు లున్నాయి. కుక్కకు చెవు లున్నాయి; పిల్లికి చెవు లున్నాయి. ఆవుకు చెవు లున్నాయి; దూడకు చెవు లున్నాయి. పక్షికి చెవు లున్నాయి; పక్కింటి వాళ్ళకు చెవు లున్నాయి. ఎక్కడ చెవు లుంటే అక్కడ వినికిడి ఉంటుంది. వీనులున్న చోట వినికిడి ఉంటుంది. పాముకు వీనులు లేవు. కనుక వినడం జరగదు.

కొందరి చెవులు శంఖాల వలె అందంగా, శుభకరంగా ఉంటాయి. కొందరి చెవులు చేటల లాగా వికారంగా విస్తరించి ఉంటాయి. వీను లెలా ఉన్నా, వీను లన్నిటిలో వినికిడి ఉంటుంది. వినికిడి ఉంటే చాలు. వీను లెలా ఉన్నా ఫరవాలేదు. కాని, వీనులుండి వినికిడి లేకపోతే, ఇక వీను లెందుకు? పూలు పెట్టుకోవడానికా! వీనులు ఉంటాయి. ఉపయోగం లేకుండా, నిరుపయోగంగా ఉంటాయి.

వీనులు నీవి. వినపడినా, వినపడక పోయినా నీ తోనే ఉంటాయి. కాని, వినికిడి అలా కాదు. వింటూ వింటూ ఒక దశలో వీనులు వినలేక పోతాయి. అంటే, వీనులు ఎక్కడికీ పోలేదు. అక్కడే ఉన్నాయి. కాని, వినికిడి పోయింది.

వీనులు నీవే. అవి వినేందుకే ఉన్నాయి. కాని, వినే శక్తి వీనులది కాదు. వినికిడిది. అర్థమైందా? ఆ వినికిడి ఎవరిది? అది నీది కాదు. పరమేశ్వరునిది. వినికిడి శక్తి భగవ ద్విభూతి (**శ్రోత్రస్య శ్రోత్రం**).

**శ్రోత్రస్య శ్రోత్రం** – చెవి యొక్క చెవి అని దేనిని కేనోపనిషత్తు నిర్వచించినదో అదే ఇక్కడ వినికిడి. **శ్రోత్రం** అంటే చెవి. **శ్రోత్రస్య శ్రోత్రం** అంటే చెవి యొక్క చెవి. అదే చెవి లోని వినికిడి. అదే భగవద్విభూతి.

మనం మన బాధల్ని వీనులకు వినిపించి వినిపించి విసుగు చెందుతున్నాం. విసుగు చెంది యున్నాం. కనుక ఇక మీదట వీనులకు వినిపించడం కాకుండా, వినికిడికి వినిపించ డానికి ప్రయత్నించాలి. అంటే, వీనులలో ఉండి వినే వాడికి వినిపించాలి.

వీనులలో ఉండేవాడు, వీనులలో ఉండి వినేవాడు విష్ణుదేవుడు. అతనికి వినిపిస్తున్నాను అని భావించి మాట్లాడటం అలవాటు చేసుకోవాలి. ఈ విధమైన కర్మాచరణములో ఫలం ఎలా ఉన్నా, దాని ప్రభావం మాత్రం మన మీద సమం గానే ఉంటుంది.

వీను లున్నవారు మన మాటను ఆమోదించారా, మనము వినిపించింది

భగవంతునికి కనుక, ఎవరు మన మాటను వినినా, లేదా అంగీకరించినా అది భగవంతుని ఆశీర్వాదంగా మనం భావిస్తాము. ఒకవేళ, వాళ్ళు ఆమోదించలేదు అనుకోండి. అప్పుడు కూడా అది ఆశీర్వాదం గానే అర్థ మవుతుంది. ఎందుకని? అది ఆమోదించ దగినది కాదని భగవంతుని నిర్ణయ మేమో! భగవంతుని నిర్ణయంతో మనం విభేదిస్తామా? అందుచేత ప్రతికూలం కూడా అనుకూలం గానే ఉంటుంది. అలా కాకుండా, వినినవాడు మారు పలకకుండా తటస్థంగా మౌనం దాల్చా డనుకోండి. అప్పుడు కూడా తృప్తి గానే ఉంటాం. ఎందుకని? మనం వినిపించింది వాసుదేవునికి కనుక, భగవంతునికి ఈ విషయము నందు ఆసక్తి లేదేమో! అని సరిపెట్టుకుంటాం. సరిపడి ఉంటాం.

ప్రతి కర్మకు దృష్టఫలం, అదృష్టఫలం ఉన్నట్లే, ప్రతి విషయాన్ని భగవంతునికి వినిపించే ప్రార్థన అనే ఈ పవిత్ర కార్యానికి కూడా దృష్ట ఫలం, అదృష్ట ఫలం రెండూ ఉంటాయి. కర్మఫలం ఎలా ఉన్నా, మన లోని ప్రశాంతత దెబ్బ తినదు. ఇది దృష్టఫలం. అలాగే, భగవంతుడికి వినిపించడము అనేది అలౌకిక కర్మ కనుక దాని ఫలితంగా భగవంతుని దయ మనకు లభిస్తుంది. ఇది అదృష్ట ఫలం.

**చెవులలో ఉండి వినేవాడు**

**చెవులు లేకుండా కూడా వినగలడు**

చెవులున్న వాళ్ళలో ఉండి వినిన భగవంతుడు, చెవులు లేని చోట మనం వినిపించినా కూడా వినగలడు. అదెలా? అనే సందేహం మీకు రావచ్చు. నీవు ఒంటరిగా ఉన్నావు. అక్కడ నీ ప్రార్థనను భగవంతునికి వినిపించావు. అది భగవంతునికి వినిపిస్తుందా, లేదా? వినిపిస్తుంది. ఎలా వినిపిస్తుంది?

**శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనోయద్** – చెవి యొక్క చెవిగా శోభించిన వాడే, మనసు యొక్క మనసై ఉన్నాడు. వీనులకు వినిపించని దానిని వీనులలో ఉన్నవాడు ఎలా ఆలకించాడో, మనస్సుకు అర్థం గాని దానిని మనస్సులో ఉన్నవాడు అర్థం చేసుకోగలడు. కనుక, వినేవాళ్ళు ఎవ్వరూ లేకపోయినా, చెవులు అనేవి లేకపోయినా వినేవాడు వినగలడు. అలాగే మనస్సులో ఉండేవాడు అర్థం చేసుకో గలడు. అతని చెవులు అంతటా ఉన్నాయి. అంతటా అతనే వ్యాపించి ఉన్నాడు.

**సర్వతః శ్రుతిమ ల్లోకే సర్వ మావృత్య తిష్ఠతి!**

అంతటా ఆయన చెవులున్నాయి. సర్వత్ర తానే స్వరూపంగా వ్యాపించి యున్నాడు. అతడే మన ప్రార్థనలు వింటున్నాడు. ఆ క్షణాన నీవు వినిపించేది భక్తి నివేదన, వినేవాడు భగవంతుడు కావడం చేత ఫలితం ఎలా ఉన్నా, అది నీకు ప్రసాదం గానే ఉంటుంది. ప్రసాద భావనలో ఉండేది ప్రశాంతతే కదా! ప్రశాంతతలో నవ్వులు ఎలా దూర మవుతాయి? ఆలోచించండి.



**వినిపించడమే ప్రార్థన**

**వినడమే దానికి సాధన**

భగవంతునికి మన ప్రార్థనలను వినిపించడం అంత సులభమా? సులభమే. ఎవరి కది సులభ సాధ్యం? భగవంతుని గూర్చి ఎవ్వడు చక్కగా వింటాడో, వాడే తన ప్రార్థనలను భగవంతునికి చక్కగా వినిపించ గలడు. అందుకనే, **భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః** – ఓ దేవతలారా! మా చెవులతో శుభమైన దానినే మేము వినెదము గాక! అని మన పూర్వీకులు ప్రార్థించారు. అలాగే శ్రవణం చేశారు. అలాగే ప్రార్థించారు. నవ్వులను పారేసుకోకుండా ఆనందంగా జీవించారు.

ఇలా, బ్రతుకును భవ్యంగా మార్చుకుంటే, మన నుండి కదిలే ప్రతి పలుకును ప్రార్థనగా తీర్చి దిద్దుకుంటే, బ్రతుకే భగవంతునికి నైవేద్య మవుతుంది. ఒకవేళ మనం ఏది ఆశించి ఇతరులతో మాట్లాడటం జరుగుతుందో అది నెరవేరక పోయినా, నెరవేరి నపుడు ఎంత సంతృప్తి కలుగుతుందో, నెరవేర నప్పుడు కూడా అంతే సంతృప్తి ఉంటుంది. నీవు నిత్య తృప్తుడవై ఉంటావు. నిరాశ్రయుడవై ఉంటావు (**నిత్య తృప్తః నిరాశ్రయః**). అలాంటి నీకు ఆనందం ఎలా దూర మవుతుంది? నవ్వులు ఎక్కడికి పారి పోతాయి? ఆలోచించండి.

**సాక్ష్యాలు కోకొల్లలు**

పూర్వాచార్యులైన భక్తు లందరు తమ ప్రార్థనలను అలాగే భగవంతునికి వినిపించారు. వారి ప్రార్థనలను ఆలకించిన పరమేశ్వరుడు వారిపై విశేషంగా దయను కురిపించి వారిని ఆశీర్వదించాడు. ఆపదలలో కూడా ఆదుకొని రక్షించాడు. అలాంటి సన్నివేశాలు భక్తుల గాథలలో దివ్యంగా శోభిస్తున్నాయి. ఆ సన్నివేశాలన్నీ భగవత్కృపకు సాక్ష్యాలుగా నిలిచి ఉన్నాయి.

**పిఛలే సాఖ్ భరో సంతన్ కీ**
**ఆడే సవారో కామ్ ।**
**సునేరి మైనే నిర్బల్ కే బల్ రామ్ ॥ సునేరి మైనే ॥**

'సాధువుల యొక్క మొరలు ఆలకించి, భక్తవత్సలుడైన భగవానుడు వారి కార్యాలను పూర్తి చేసిన ఎన్నో ఋజువులు (**సాఖ్**) గతంలో (**పిఛలే**) చరిత్ర పుటలలో నిండిపోయి ఉన్నాయి (**భరో**). అవన్నీ నేను ఆలకించి ఉన్నాను (**సునేరి మైనే**). బలహీనులకు (**నిర్బల్ కే**) బలము (**బల్**) రాముడే (**రామ్**) అని నేను విని యున్నాను' అని సంత్ సూరదాస్ ఒక కీర్తనలో అద్భుతంగా గానం చేశాడు.

**దృపద్ సుతా నిర్బల్ భయి తాదిన్**
**గహలాయె నిజ్ ధామ్ ।**
**దుశ్శాసన్ కీ భుజా థకిత్ భయి**
**వసన్ రూప్ భయె శ్యామ్ ॥ సునేరి మైనే ॥**

'ఆ నాడు (**తాదిన్**) ద్రుపదుని కుమార్తె యైన ద్రౌపది (**దృపద సుతా**) కౌరవ సభలో దీనురాలై (**నిర్బల్ భయి**) నీవే దిక్కు అని భావించి పిలిచినపుడు (**గహలాయె నిజ్ధామ్**), కనికరించిన శ్రీకృష్ణదేవుడు తానే వస్త్ర రూపమును ధరించినాడు కదా! (**శ్యామ్ వసన్ రూప్ భయె**). ఆ వస్త్రాలను తొలగించలేక దుశ్శాసనుని బాహు బలమంతయు (**దుశ్శాసన్ కీ భుజా థకిత్ భయి**) అణగారి పోయింది కదా!' అంటూ భగవంతుడు భక్తుల

మొర లాలకించిన సన్నివేశాలను స్మృతికి తెచ్చుకొని గానం చేశాడు సంత్ సూరదాస్.

**అదే అందరి మార్గం**

భక్తు లందరు తమ విన్నపాలను భగవంతునికి అలాగే వినిపించారు. ప్రహ్లాదుడు అలాగే వినిపించాడు. మధువనంలో ధృవ బాలకుడు అలాగే వినిపించాడు. పంపాతీరంలో శబరి అలాగే వినిపించింది. కన్యాకుమారిలో వివేకానందస్వామి అలాగే వినిపించాడు. గంగాతీరంలో రామతీర్థ స్వామి అలాగే వినిపించాడు. వీరందరూ అద్భుత చరితులు. అసమాన ప్రజ్ఞా ధురీణులు. వారందరి ప్రార్థనలను ఆలకించిన పరమేశ్వరుడు వారి ద్వారా అద్భుతమైన కార్యాలను ఆవిష్కరింప చేశాడు.

మహాభక్తులు, జ్ఞానులైన వారి ప్రార్థనలను ఆలకించడమే కాదు. ఒక సామాన్య బాలుడు, పరితపించడమే గాని ఏ పాండిత్యము లేని సాధారణ బాలుడు, కైవల్యా నదీ తీరంలో సైకత శ్రేణులపై కూర్చొని విలపిస్తూ ప్రార్థిస్తే; బుద్ధి వికసనము లేని బాలుడు సుందర రాజన్ విన్నపాలను వినిపిస్తే, అతని మాటలు కూడా భగవానుడు విన్నాడు కదా!

వినకపోయి ఉంటే ఇంత పని జరిగేదా? అనితర సాధ్యంగా, ప్రతి యజ్ఞంలో వేలాది మంది శ్రోతలను మంత్ర ముగ్ధులను చేస్తూ, వారి బుద్ధులను పరివర్తన దిశగా మళ్ళిస్తూ, సూది మోపిన నిశ్శబ్ద వాతావరణంలో శాస్త్ర లోతులను విప్పుతూ విపులీకరించి బోధించడం సామాన్యమైన విషయమా? అసమానమైన జ్ఞాన యజ్ఞాలను రెండు వందల పదిహేను నిర్వహించడం, లక్షలాది మందిని భక్తులుగా మార్చడం సాధ్యపడే విషయ మేనా? తామర తంపరగా జ్ఞాన సుగంధాలను వెదజల్లే అందమైన గ్రంథాలను సమాజానికి అసంఖ్యాకంగా అందించడము సాధారణమైన కార్యమా? ఈ కార్యాలకు ఋజువులు కావాలా? గుర్తింపులు అవసరమా? గుర్తింపులు, గౌరవాలు ఆశించి ఉంటే ఇదంతా జరిగే దేనా? ఇదంతా భక్తుడి వైభవం కాదు. భక్తి వైభవము. కనుక, ఎవరైనా సొంతం చేసుకోవచ్చు. కాకపోతే, కావలసిందల్లా వివేక వైరాగ్యాలు, విద్యా వినయాలు, శ్రద్ధాభక్తులు. అంతే . . . అంతే . . . అంతే . . !

ఆత్మబంధువులారా! ఈ ప్రపంచంలో మనం ఉండే మూడు రోజులు నవ్వుతూ జీవించలేక పోవడానికి కారణా లేమిటో అనేక కోణాల నుండి పరిశీలించి, విశ్లేషించి, అవగాహనతో ఆ ప్రతిబంధకాలను ఎలా నివారించుకోవాలో ఇప్పటి వరకు గడచిన మూడు ఉపన్యాసాలలో చూశాం. ఇక ప్రధానంగా ఒక్కటి మిగిలి ఉంది. మన పరిసరాలు, మనకు ఎదురయ్యే ప్రతికూల పరిస్థితులు ఏవో కావు. గతంలో మనం ఆచరించిన కర్మల యొక్క ఫలాలే. మనం గతంలో ఏమేమి చేశామో మనకు తెలియదు. వాటి ఫలితంగా ఎప్పుడు ఏ ఉత్పాతము ఊడి పడుతుందో అర్థం కాదు. చేసినవి అర్థం కానే కావు. ఫలితాలు వచ్చినపుడే అవేమిటో అర్థ మవుతాయి. వాటిని ఎలా అధిగమించాలో, వాటి వల్ల ఏర్పడే సుఖదుఃఖాలకు హేతువులైన రాగద్వేషాలను ఎలా తటస్థ పరచాలో తెలిస్తే గాని, బాధలలో కూడా నవ్వుతూ జీవించ లేము. ఈ సత్యాలను గ్రహించే ప్రవచనము మిగిలి ఉంది. సాయంత్రం ఆరు గంటలకు చివరి ప్రవచనంలో అవి కూడా చూద్దాం.

ఓం. . . ఓం . . . ఓం . . .





# నవ్వుతూ జీవించాలి - 4

**ఆత్మబంధువులారా!**

'నవ్వుతూ జీవించాలి' అని మనం చర్చిస్తున్న ప్రసంగ పరంపరలో ఇది చివరి ప్రవచనము. ప్రపంచము ఎలా నియతితో నడుస్తూ ఉందో, ఆ నియతి వెనుక నియంత (భగవంతుడు) జ్ఞానము ఎలా ఇమిడి ఉందో, అట్టి జ్ఞానమును అర్థం చేసుకుంటూ ఒడుదొడుకులు లేని జీవనాన్ని ఎలా కొనసాగించాలో అర్థం చేసుకున్నాం.

అలాగే మనతో కలిసి జీవిస్తున్న వ్యక్తులు, మనతో సంబంధ బాంధవ్యాలను కొనసాగించే వ్యక్తుల విషయంలో ప్రధానంగా ప్రేమ, సానుభూతి ఉండాలని, అవి ఎందుకు ఉండాలో కూడా అర్థం చేసుకున్నాం. ఇక మూడవది మన విషయము. మన మేమిటో తెలుసుకోవడం – మనం మనంగా ప్రశాంతంగా జీవించడం. ఈ మూడు విషయాలను అనేక కోణాల నుండి సమగ్రంగా, సవిస్తరంగా చర్చించు కున్నాం. ఈ దశలో నవ్వుతూ జీవించడానికి అతి ముఖ్యమైన మరొక విషయం శేషించి ఉంది. దానిని ఈ ప్రవచనంలో చర్చించి, ఈ ప్రసంగ పరంపరను సమాప్తి చేసుకొని, రేపు ఉదయం గురుపూర్ణిమ పర్వదినాన్ని జరుపుకుందాం.

**ఏదైనా సంభవమే**

మనకు జ్ఞానం ఉంది. కాని, పరిమితంగా ఉంది. అందుచేత దేనినీ సంపూర్ణంగా అర్థం చేసుకోలేక పోతున్నాం. కళ్ళ ముందున్నవే అర్థం కావడం లేదు. ఇక గత మంతా తెలిసి వస్తుందా! గతంలో, లేదా గత జన్మలలో మనం ఆచరించిన కర్మలన్నీ మనకు తెలుసా? తెలియక పోవచ్చు. కాని అవి ఎవరి కర్మలు? అవి చేసిం దెవరు? మనమే. అవి మన కర్మలే. మరి, వాటి ఫలితాలు ఎవరికి రావాలి? మనకే. అవి ఎలా ఉంటాయో మనకు తెలుసా? తెలియదు. కర్మఫలాలు అందినప్పుడు మనం గతంలో ఏది ఆచరించామో అర్థ మవుతుంది.

కర్మ ఫలా లైతే వస్తాయి. అవి ఏ రూపంలో ఉంటాయో ముందుగా అర్థం కావు. ఇక్కడే బ్రతుకు తారుమా రవుతూ ఉంటుంది. భయంకరమైన వ్యాధులు సంభవించ వచ్చు. దారుణమైన ప్రమాదాలు జరగ వచ్చు. ఆత్మీయుల బ్రతుకులు అస్తవ్యస్తంగా మారవచ్చు. ఇలాంటి అనూహ్యమైన పరిణామాలు సంభవించి నపుడు నవ్వుతూ జీవించగలమా? అనే ప్రశ్న మనల్ని వేధిస్తూనే ఉంటుంది. అదీ చర్చించుకుందాం.

**భగవత్కృప**

ఇలాంటి అసాధారణ పరిస్థితులలో మనల్ని రక్షించేందుకు, మన లోని ప్రశాంతత భగ్నం కాకుండా చూసేందుకు మనకు మరొకరి సహాయం అవసరం. ఆ సహాయాన్ని అందించే వారు మన లాంటి వారే అయితే, అది పొందీ ఉపయోగం లేదు. కర్మఫలాల

విషయంలో అలాంటి సహాయాలు సరిపోవు. అందుకే భగవంతుని సహాయం అవసరం. అదే దయ. భగవత్కృప.

మరైతే, ఇప్పుడు మనకు భగవత్కృప లేదా? ఉందనే నేను అనుకుంటున్నాను. దానికి ఋజువు లెందుకు? ఈ సమయంలో మీరు, నేను ఈ శ్రుతిమందిరంలో ఉండటమే భగవత్కృప. ఆలోచించండి.

ఈ సమయం లోనే ప్రపంచంలో ఎందరు ప్రమాదాలలో చిక్కుకొని ఉన్నారో మనకు తెలుసా? ఆసుపత్రులలో చావు బ్రతుకుల మధ్య ఎందరు కొట్టు మిట్టాడుతున్నారో తెలుసా? ఈ క్షణంలో దుర్భరమైన బాధల్ని భరించలేక పుట్టెడు దుఃఖంతో ఎందరు విలపిస్తున్నారో తెలుసా? శోకమయమైన ఈ లోకంలో ఈ మాత్రం ప్రశాంతంగా కూర్చుని శాస్త్రాన్ని అధ్యయనం చేస్తున్నామంటే, పరమ పవిత్రమైన దైవ జ్ఞానాన్ని గూర్చి చర్చిస్తున్నా మంటే, మనం భగవంతుని దయను ఎంతగా అనుభవిస్తున్నామో ఇట్టే అర్థమై పోతుంది.

భగవంతుని దయ అంటే ఏమిటో కూడా మనకు అర్థం కావాలి. దయ ఏదో కాదు. అది మన కర్మఫలమే. మనం ఆచరించిన సుకృత విశేషమే దయ రూపంలో దర్శన మిస్తుంది. నీ కర్మకే నీకు ఫలితం అందుతూ ఉంది. అయినా, దానిని దయ అని ఎందుకంటున్నామో తెలుసా? కర్మఫలం నీదే అయినా, ఇచ్చేవాడు పరమేశ్వరుడు కావడం చేత, నీకు ఎప్పుడు అనుగ్రహించాలో తెలిసి దానిని ప్రసాదిస్తున్నాడు. కనుక, ఆ ప్రసాదము దయ అయింది.

భగవంతుని దయ మనల్ని కాపాడుతుంది. దయ కర్మఫలం అని తెలుసుకున్నాం. ఇక్కడ కర్మఫల మంటే లౌకిక కర్మఫలం కాదు; అలౌకిక కర్మఫలం. భగవ త్సంబంధమైన పూజ, జపము, ధ్యానము, సంకీర్తనము, పారాయణము మొ॥లైన దివ్య కర్మలన్నీ అలౌకిక కర్మలు. వాటి ఫలితమే భగవత్కృప. నేడు భగవత్కృప మనకు అందుతూ ఉంది అంటే, గతంలో మనం అర్చన ధ్యానాదులను ఆచరించిన వారమే అని అర్థం.

గతంలో ఆచరించిన మనం ప్రస్తుత మెందుకు ఆచరించ లేము? ఆచరించాలి. ఆచరించి తీరాలి. ఫలితాల కొరకు, దయ కొరకు ఆచరించాలి అనేది నా అభిప్రాయం కాదు. మనం ముముక్షువులం. మోక్షాపేక్ష కలిగిన వాళ్ళం. మోక్షం జ్ఞానరూపంలో ఉంది అని తెలిసిన వాళ్ళం. జిజ్ఞాసువులం. జ్ఞానాన్ని సముపార్జించే వాళ్ళం. జ్ఞాన సముపార్జనకు అంతఃకరణ శుద్ధి, అంతఃకరణ నైశ్చల్యం అవసరం. కర్మయోగము ద్వారా అంతఃకరణశుద్ధి, ఉపాసనల ద్వారా అంతఃకరణ నైశ్చల్యం ఏర్పడుతుంది. దాని కొరకే మనం ఆధ్యాత్మిక సాధనలు ఆచరిస్తాం.

## దృష్టఫలం - అదృష్టఫలం

కాకపోతే, ప్రతి కర్మకు దృష్టఫలం, అదృష్టఫలం ఉన్నట్లు, అలౌకిక కర్మలకు కూడా ఉంటుంది. అలౌకిక కర్మలకు దృష్టఫలం ప్రశాంతత కాగా, అదృష్టఫలం దయగా ఉంటుంది.



అవాంతర పరిస్థితులు, అసాధారణ ఫలాలు, దారుణమైన ఉత్పాతాలు సంభవించి నపుడు, వాటిని తటస్థం చేసి, మన సాధన నిరాటంకంగా సాగేలా చూసేందుకు, బాధలు, దుఃఖాలు లేకుండా జీవించేలా ఆశీర్వదించేందుకు దయ ఉపకరిస్తుంది. అందుకని నిరంతరము సాధనలు కొనసాగిస్తూ ఉండాలి. భగవంతుని దయను ప్రోది చేసుకోవాలి. ఆ దయ చేత రక్షింప బడాలి. భగవంతుడు భక్తుల్ని ఇలాగే రక్షిస్తాడు. కాకపోతే, భగవంతుడు నన్ను రక్షిస్తాడు అనే విషయంలో మనకు అకుంఠితమైన విశ్వాసం ఉండాలి (**రక్షిష్యతీతి విశ్వాసః**).

శస్త్ర చికిత్స జరుగబోతూ ఉంది. ఆపరేషన్ థియేటర్‌లో రోగిని బల్లపై పడుకో బెట్టారు. శస్త్ర చికిత్స చేసే వైద్యుడు పరికరాలతో సిద్ధంగా ఉన్నాడు. ఆయన కంటె ముందు మరొక వైద్యుడు వస్తాడు. అతడు మత్తు మందు ఇస్తాడు. ఇవ్వగానే రోగి స్పృహను కోల్పోతాడు. ఆ తరువాత వైద్యుడు శస్త్ర చికిత్స ఆరంభిస్తాడు.

కాని, మత్తుమందు నిచ్చే వైద్యుడు ముందుగా తన చేతులను దులిపేసు కుంటాడు. ఒక కాగితంపై రోగి చేత సంతకం చేయించు కుంటాడు (consent form). ఏమని? 'నా కేదైనా జరిగితే, నాదే బాధ్యత కాని, వైద్యులది కాదు' అని. అంటే, స్పృహ తప్పిన తరువాత ఏది జరిగినా, బాధ్యత నాదే అని స్పృహలో ఉండి రోగి సంతకం చేస్తున్నాడు. మంచిదే. వైద్యునిపై ఆ మాత్రం విశ్వాసం ఉండాలి. కాకపోతే, వైద్యుల పైనే అంత విశ్వాసం ఉండేటప్పుడు, వైద్యులకు వైద్యుడైన నారాయణుడిపై ఎంత విశ్వాసం ఉంచాలి? భౌతిక రోగాలను పోగొట్టే వైద్యుల పైనే అంత విశ్వాసం ఉంచేటప్పుడు, భౌతిక రోగాలతో పాటు భవ రోగాన్ని కూడా పోగొట్టే నారాయణుడిపై మన విశ్వాసం ఏ స్థాయిలో ఉండాలో ఆలోచించుకోండి. ఏ రోగమైనా, అది భౌతిక రోగమైనా, భవ రోగమైనా, రెండిటికి భేషజము, భిషగ్వరుడు రెండూ భగవంతుడే అనే సత్యాన్ని జ్ఞాన పూరితంగా గ్రహించాలి. దీనినే విష్ణుసహస్రనామం కూడా ప్రతిపాదించి ప్రవచించింది.

**త్రిసామా సామగః సామః నిర్వాణం భేషజం భిషక్** । భగవంతుడు భేషజము (విష్ణుసహస్రనామం - 578 వ నామం), మరియు భిషగ్వరుడు (విష్ణుసహస్రనామం - 579 వ నామం). సంసారమనే రోగమునకు (భవరోగమునకు) ఆయనే ఔషధము కనుక భగవంతుడు భేషజము (**సంసార రోగస్య ఔషధమ్ భేషజమ్**).

ఔషధమైన భగవానుడే వైద్యుడు కూడా (**భిషక్**). భవరోగాన్ని నిర్మూలించడానికి ఉపకరించే బ్రహ్మవిద్యను ఉపదేశించిన వాడు కావడం చేత ఆయన భిషగ్వరుడు (**సంసార రోగ నిర్మోక్షణ కారిణీం పరాం విద్యాం ఉపదిదేశ ఇతి భిషక్**).

## కర్మ - కర్మయోగము

నదిని దాటా లనుకొనే వాడు నదిలో దిగక తప్పదు. అలాగని, కేవలం నదిలో దిగితే సరిపోదు. నదిని దాటడానికి ఈత కూడా తెలిసి ఉండాలి. లేకపోతే మునిగి పోవచ్చు.

అలాగే కర్మ ప్రవాహాన్ని దాటి మోక్ష తీరాన్ని చేరాలని అభిలషించే ముముక్షువు కర్మలలో దిగక తప్పదు.

కర్మ సుడిగుండం భయంకర మైనది. అదొక మహా సాగరం. కర్మఫలం అశాశ్వతంగా ఉంటుంది. పైగా అది మోక్షానికి ప్రతిబంధకంగా కూడా ఉంటుంది **(ఫల మశాశ్వతం గతి నిరోధకం)**. కనుక నదిలో దిగిన వాడు మునిగి పోకుండా ఉండాలి అంటే, ఈత వచ్చి ఉండటం ఎంత ముఖ్యమో, కర్మ వలయంలో చిక్కుకొనిన వాడు దాని నుండి బయట పడాలి అంటే కేవలం కర్మలను ఆచరించడం కాదు, కర్మలను కర్మయోగంగా ఎలా మార్చుకోవాలో తెలిసిన వాడై ఉండాలి. కర్మలు ఎవరి నైనా ముంచేస్తాయి. కర్మయోగం బుద్ధిని శుద్ధి చేసి, ముక్తికి సిద్ధం చేస్తుంది. అందుచేతనే,

**తయోస్తు కర్మ సన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే**

కర్మసన్యాసము కంటే కర్మయోగమే శ్రేష్ఠమని భగవద్గీత - ఐదవ అధ్యాయంలో భగవంతుడు కర్మయోగాన్ని స్తుతించాడు. అందుకనే, కర్మయోగాన్ని అనుష్ఠించుటకు యోగ్యమైన గృహస్థాశ్రమమును పవిత్ర మైనదిగా భావిస్తారు. వినియోగించుకొనే వారికి గృహస్థాశ్రమము గంగాజలము వంటిది. గృహస్థాశ్రమ ప్రాశస్త్యము ఎరిగిన వారికి అది తులసిదళం లాంటిది. కనుకనే,

**యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ ।**
**సిద్ధ్య సిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥**

'అర్జునా! యోగనిష్ఠలో ఉండి కర్మలను ఆచరించు. ఫలాసక్తిని త్యజించు (ఫలసంగం లేకుండా కర్మలను ఆచరించు). ఫలం సిద్ధించినా, సిద్ధించక పోయినా, సమబుద్ధితో వర్తించు. సమత్వమే కదా యోగము' అన్నాడు భగవద్గీత - రెండవ అధ్యాయంలో గీతాచార్యుడు.

**ధర్మాచరణము**

మనిషికి కర్మస్వేచ్ఛ ఉంది. అంతే కాదు. ఈ ప్రపంచము నియతితో నడుస్తూ ఉంది అని కూడా అర్థం చేసుకున్నాం. ఇట్టి ప్రపంచంలో నీవు కర్మస్వేచ్ఛను కలిగి ఉండటమే కాదు, నియతిని కూడా అనుసరించ వలసి ఉంటుంది.

రహదారిపై నీవు నడచి పోవచ్చు. నీవు నడవటానికే మార్గం ఏర్పాటు చేయబడింది. అయితే, నీవు కొన్ని నియమాలను పాటించక తప్పదు. నీవు రహదారిపై నడచి పోవచ్చు. రహదారి నీది కాదు. అది ప్రభుత్వానిది. బాటసారులు పాదచారు లైనపుడు ఎడమ వైపుననే నడవాలి అనేది ప్రభుత్వము ఏర్పాటు చేసిన నియతి. దానిని నీవు అతిక్రమించ కూడదు. నియమాలను పాటిస్తూనే చరించాలి.

అలాగే, ఈ ప్రపంచం నువ్వు, నేను సృష్టించినది కాదు. మన కన్నా ముందే సృష్టింప బడిన ప్రపంచాన్ని వినియోగించుకొంటూ మనం జీవిస్తున్నాం. వినియోగము జరిగే టప్పుడు



నియమపాలనను విస్మరించ కూడదు. కనుక ఈ సృష్టి లోని నియతిని మనం అనుసరించాలి. నియతిని అనుసరిస్తూ నియతి రూపంలో శోభిస్తున్న నియంతను గుర్తించాలి.

కర్మ స్వేచ్ఛ నీకు ఉంది. కనుక నీవు కర్మలను ఆచరిస్తావు. కాని, కర్మఫలాలను శాసించే అధికారము, శక్తి నీకు లేవు. ఆ మాత్రం శక్తి నీకు, నాకు ఉంటే, ఇక మన జీవితాలలో అపజయాలే ఉండేవి కావేమో? మనకు కావలసిన ఫలాన్ని మనమే తెచ్చుకునే వాళ్ళమేమో? అంతేగాదు, ఇతరులకు ప్రాప్తించే సత్ఫలితాలను కూడా చెడగొట్టే వాళ్ళ మేమో! కాని అంత గొప్ప గుణం మన లోనే కాదు, మన శత్రుపక్షములో కూడా ఉంటుంది. మనకు వచ్చే సత్ఫలితాన్ని వాళ్ళు కూడా అడ్డుకోగలరు. ఈ విధమైన ఫల సంతర్పణము ఎక్కడికి దారి తీస్తుందో, ఆలోచిస్తే అర్థం కాకపోదు. అందుచేతనే,

**కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన!**

'కర్మ చేయుట యందే నీకు అధికారము ఉంది. ఫలాల విషయంలో లేదు' అన్నాడు గీతలో భగవానుడు. ఫలితాలపై నీకు అజమాయిషీ లేదు. నీవు కర్మఫల ప్రదాతవు కాలేవు. పరిమిత జ్ఞానంతో దోబూచులాడే నీవు సర్వులకు కర్మఫలాలను ఎలా అందించ గలవు? అది సర్వజ్ఞునికే సాధ్యం. సర్వశక్తిమంతుడైన సర్వేశ్వరునికే సాధ్యం **(కర్తుః ఆజ్ఞయా ప్రాప్యతే ఫలం)**.

***కర్మసంగం - ఫలసంగం***

మనకు కావలసింది మోక్షమా? కర్మఫలమా? ఈ విషయంలో స్పష్టత రావాలి. మనం కర్మ చేస్తాం. కాని ఫలం వాంఛనీయం కాదు. వచ్చిన కర్మఫలం మనల్ని బాధించ కుండా చూసుకోవాలి. ఫలసంగం లేకుండా ఫలాన్ని అందుకోవాలి. మరి, కర్మ మనదై నపుడు కర్మఫలం మనది కాకుండా ఎలా పోతుంది? అది వాస్తవం కనుక, కర్మఫలసంగం లేకుండా ఉండాలి అంటే కర్మసంగం లేకుండా చూసుకోవాలి. జాగ్రత్తగా అర్థం చేసుకోండి.

మనం రెప్ప కొడుతూ జీవిస్తున్నాం. కళ్ళు మూస్తూ తెరుస్తూ ఉన్నాం. ఇది కర్మ. ఎవరి కర్మ? అని అడిగితే నా కర్మ అంటున్నాము. నిజంగా కంటిపై రెప్ప వేస్తూ జీవించడము కర్మే కావచ్చు. అది నా కర్మ అనే చోటే అనుమానంగా ఉంది. అది నా కర్మే అయితే, నా ఇల్లు అన్నప్పుడు ఇల్లు నాదే గాని మీది ఎలా కాదో, అలాగే రెప్పపాటు నా కర్మే అయితే, నేను మాత్రమే రెప్ప కొట్ట గలగాలి. మీ రెప్పలు అలాగే ఉండి పోవాలి. మీకు రెప్పపాటు సాధ్య పడకూడదు. ఇది వాస్తవ మేనా? ఆలోచించండి.

రెప్పపాటు అనే కర్మ అందరికీ ఉంది. అది నాకు ఒక్కడికే పరిమితం కాదు. రెప్పపాటు అనే కర్మ నాది కాదు. కాని, నేను రెప్ప కొడుతున్నాను.

కర్మ నాది అయితే నేను కర్త నవుతాను. కర్తను నేనైతే ఫలం నాది అవుతుంది. నా ఫలాన్ని నేనే అనుభవించాలి. అప్పుడు నేను భోక్త నవుతాను. కర్తృత్వము ఉండేవాడు కర్త. భోక్తృత్వము ఉండేవాడు భోక్త.

కర్మ నేను చేస్తాను. కాని, కర్మ నాది కాదు. కర్మ నాది కాదు కనుక కర్మఫలం కూడా నాది కాదు. నాకు ఫలసంగం లేదు. కనుక నేను భోక్తనూ కాను. కర్తృత్వము, భోక్తృత్వము రెండూ లేనపుడు ఏ విధమైన ఫలము సిద్ధించినా నా కది ప్రసాదము అవుతుంది. ప్రసాదము ప్రసన్నతను ప్రసాదిస్తుంది.

మరి, కర్మఫలం నాకు అవసరము లేనప్పుడు, నేను చేసే కర్మలు ఎవరి కొరకు? కర్మలు దేని కొరకు చేయాలి? అనే ప్రశ్నలు మనలో ఉదయించ వచ్చు. దీనికి సమాధానం ఒక్కటే. ఈశ్వర ప్రీత్యర్థము చేయాలి. మనము గతంలో చేసిన పాపాలన్నీ ప్రక్షాళనం కావటానికి, అలాగే భగవంతుని కృపను పొందడానికి చేయాలి. అప్పుడు మనం చేసే ప్రతి కర్మ కైంకర్యమే అవుతుంది. పని పూజగా మారేది ఇక్కడే. అందుచేతనే అర్చనారంభములో మనము ఈ విధమైన సంకల్పమే చేస్తాము.

**మమోపాత్త సమస్త దురిత క్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం పూజాం కరిష్యే!**

అని సంకల్పము చెబుతాము.

'ఈశ్వరుని ప్రీతి కొరకు పూజ చేస్తున్నాను' అంటే, భగవంతుడు తృప్తి చెందడానికి మన పూజ అవసరమా? అంటే, ఇప్పుడు భగవంతుడు అసంతృప్తితో ఉన్నాడని అర్థమా? ఎవరి కైనా ఆకలి ఉంటే అన్నం పెడతాము. దాహం ఉంటే నీళ్ళు ఇస్తాము. అలాగే ఈశ్వరునికి అసంతృప్తి ఉందని గుర్తించి, ఆయనకు సంతృప్తిని కలిగించేందుకు పూజలు చేస్తున్నామా? మన కర్మలు మనవి. మన కర్మఫలాలు కూడా మనవే. మన కర్మఫలాలు ఈశ్వరుని కెందుకు? మన కర్మలకు ఫలాన్ని అనుగ్రహించే కర్మఫల ప్రదాతకు మన కర్మఫలాల అవసర మేముంది? ఇప్పుడు చెప్పండి, ఈశ్వర ప్రీత్యర్థం అంటే ఏమిటో.

మన కర్మఫలం మనకు అవసరం లేదు. అలాగే ఈశ్వరునికీ అవసరం లేదు. మరి కర్మాచరణము లోకంలో ఎందుకు జరగాలి? లోకకళ్యాణార్థం జరగాలి.

### *లోక కళ్యాణం*

కర్మలలో ఉంటూ, కర్మలలో చిక్కుకోకుండా జీవించాలంటే, లోక కళ్యాణార్థం కర్మలు ఆచరించడమే ఏకైక మార్గము. మహాత్ము లందరూ గతంలో అలాగే ఆచరించారు. శ్రేష్ఠులైన వారు చూపిన మార్గమే ఏనాటి కైనా శ్రీరామరక్ష.

ఎప్పుడైతే కర్మలను స్వార్థం కొరకు కాకుండా లోక కళ్యాణార్థం ఆచరిస్తున్నామో, కర్మఫలాలు అనుకూలమైనా, ప్రతికూలమైనా మనల్ని బాధించవు. పవిత్రమైన ప్రసాద భావనలో అయిష్టా లుండవు. అరుచు లుండవు.

**సిద్ధ్య సిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ।**

ఏది సిద్ధించినా, ఏది సిద్ధించక పోయినా మన బుద్ధిలో తేడా ఉండదు. సదా బుద్ధి సమం గానే ఉంటుంది. ఇదే యోగ జీవనము. కర్మయోగ జీవనము. కర్మలలో ఉంటూ కర్మలకు అంటని పవిత్ర జీవనము. జ్ఞాన సముపార్జనమునకు చిత్తమును సంసిద్ధం చేసే పరమ పవిత్రమైన నిష్కామ కర్మయోగము.



చరణము : **అనుకూలములు ప్రతికూలములు కర్మలలో లేవు**
**అధికమైనా, అల్పమైనా ఫలము నిష్ఫలము**
**రాగము కాని, ద్వేషము లేని ఫలములు బాధించవు**
**ఏది వచ్చినా ఎలా వచ్చినా నీ కది ప్రసాదము ॥**

పల్లవి : **ఏ కర్మమునకు ఏది ఫలమో ఎరిగిన వారెవరు?**
**చేసిన కర్మము ఫలమును పొందక దాటే వారెవరు? ॥ ఏ కర్మమునకు ॥**

అని కర్మయోగ రహస్యాన్ని బుద్ధికి పట్టించింది చైతన్య గీతిక.

### *అంతా మన మంచికే*

పూర్వము రాజుగా రొకరు ఉండేవారు. ఆయన వద్ద సదాచారవంతుడు, పండితుడు, రాజనీతిజ్ఞుడు, మహాభక్తుడైన ఒక వ్యక్తి మంత్రిగా ఉండేవాడు. మంత్రి గారి సలహా లేనిదే రాజు గారు ఏ నిర్ణయాన్ని తీసుకొనే వారు కారు. కనుక మంత్రి గారిని సదా తమ వద్దే ఉంచుకొనే వారు. అరణ్యానికి వేటకు వెళ్ళినా మంత్రి గారిని వెంట పెట్టుకొని వెళ్ళేవారు.

ఒకనాడు రాజు గారు వేటకై అరణ్యానికి బయలుదేరారు. ఆ రోజు మంత్రి గారు పట్టణంలో లేరు. కనుక, రాజు గారు ఒంటరి గానే పరివారంతో కలిసి వేటకు వెళ్ళారు.

వేటాడే సమయంలో చెట్ల మధ్య నుండి ఒక పులి అమాంతం ఎగిరి దూకి రాజు గారిపై పడింది. రాజు గారు దానిని ఎదిరించి భయంకరంగా పోరాడారు. పులి అయితే ఒక దశలో పారిపోయింది గాని, ఆ పోరాటంలో రాజు గారి ఎడమ చేతి బొటన వేలు తెగి పోయింది.

పరివారం రాజు గారిని ఆస్థానానికి చేర్చారు. వైద్యులు చికిత్స చేశారు. రాజు గారు విశ్రాంతిలో ఉన్నారు. ఈ లోగా దేశాంతరము వెళ్ళిన మంత్రి గారు తిరిగి వచ్చారు. రాజు గారి సన్నిధికి వచ్చారు. వేటలో తాము గాయపడిన విషయాన్ని రాజు గారు మంత్రి గారికి తెలియ చేశారు. విషయ మంతా ఆలకించిన మంత్రి గారు 'అంతా మన మంచికే ప్రభూ' అన్నారు.

'అంతా మన మంచికే – అంతా మన మంచికే' అని ప్రతి విషయానికి స్పందిస్తూ ఉండటము భక్తుడైన మంత్రి గారికి అలవాటు. ఆ విషయం రాజు గారికి కూడా తెలుసు.

అయినా, ప్రస్తుత పరిస్థితి వేరు. ఒక వైపు వేలు పోగొట్టుకొని, చికిత్స పొందుతున్న సమయంలో కూడా, 'అంతా మన మంచికే' అనే మంత్రిగారి మాటల్ని జీర్ణించుకోలేక పోయిన రాజు గారు, 'మంత్రిని కారాగృహంలో బంధించండి' అని ఆజ్ఞాపించారు. మంత్రి గారు కారాగృహంలో కూడా నవ్వుతూనే జీవిస్తున్నారు.

కొంత కాలం జరిగింది. రాజు గారికి వేట అనేదే వినోదము. మళ్ళీ ఒంటరిగా బయలుదేరి మృగాలను వేటాడేందుకు అరణ్యం లోకి ప్రవేశించారు. ఈసారి కొందరు బందిపోటు దొంగలు వచ్చి, రాజు గారిని అపహరించుకొని, కీకరారణ్యం లోకి ప్రవేశించారు.

అక్కడ వందలాది బందిపోటు దొంగలు ఉన్నారు. ఎత్తైన అమ్మవారి విగ్రహము ఒకటి భయంకరంగా ఉంది. వామాచార పద్ధతిలో అమ్మవారికి అక్కడ జాతర జరుపు కుంటున్నారు. అది చివరి రోజు. అమ్మవారికి నరబలి ఇవ్వడము వారి ఆచారము. ఆ నరబలికి రాజు గాని, లేదా సన్యాసి గాని అయితే శ్రేష్ఠమని వారి అభిప్రాయము. ఊహించని విధంగా రాజుగారే లభించారు. దొంగ లందరూ ఎంతగానో సంబరపడి పోయారు.

రాజు గారికి స్నానం చేయించారు. పసుపు కుంకుమలు ముఖానికి అద్దారు. ఎఱ్ఱని వస్త్రాలు తొడిగి, ఎఱ్ఱని పూలదండలతో రాజు గారిని అలంకరించారు. వధ్యశిల వద్దకు నడిపించుకొని వచ్చి అమ్మ వారికి అభిముఖంగా నిలబెట్టారు. ఇక వధించడమే మిగిలి ఉన్న కార్యము.

వారి సంప్రదాయానుసారము అమ్మవారికి నరబలి ఇచ్చే ముందు, ఎవరి నైతే బలి ఇస్తున్నారో ఆ వ్యక్తి బలికి అర్హుడా కాదా? అనే విషయాన్ని ప్రధాన పురోహితుడు నిర్ణయించాలి. ఆ తరువాతే నరబలి ఇవ్వడం జరుగుతుంది.

అలాగే ప్రధాన పురోహితుడు వచ్చాడు. రాజు గారిని ఆపాద మస్తకం పరీక్షించాడు. చివరిగా చేతి వైపు చూశాడు. ఎడమ చేతికి బొటన వ్రేలు లేదు. అంగవైకల్యం ఉండే వ్యక్తిని బలి ఇవ్వకూడదు అని నిర్ణయించాడు.

ఇక చేసే దేమీ లేక రాజు గారిని విడిచి పెట్టారు దొంగలు. రాజు గారు సురక్షితంగా ఆస్థానం చేరారు. కాని, రాజు గారి మనస్సును ఒక విషయం పీడిస్తోంది.

మంత్రి సచ్ఛీలుడు. భక్తుడు. దూరదృష్టి కలవాడు. ప్రస్తుతం అతనిని నేను కారాగృహంలో బంధించాను. 'అంతా మన మంచికే ప్రభూ' అన్నందుకే అతనిని శిక్షించాను. కాని, అతని మంచి మనస్సు పలికిన మంచి వాక్యంలో ఉండే మంచిని నేను గ్రహించలేక పోయాను.

మంత్రి చెప్పింది సత్యము. నా మంచి కొరకే నా వేలు పోయింది. ఒకవేళ అది పోకుండా ఉంటే నేను వధించబడి ఉండేవాణ్ణి. వేలు లేకపోవడము చేతనే నేను రక్షింప బడ్డాను.

ఎంత పొరపాటు చేశాను. సదా నన్ను కంటికి రెప్పలా కాపాడుకొంటూ, నా మంచి కోరే మంత్రి గారిని శిక్షించాను. క్షమించరాని అపరాధం చేశాను, అని పశ్చాత్తాపం చెందుతూ, సైన్యాధిపతిని వెంట బెట్టుకొని, తానే స్వయంగా కారాగృహానికి వెళ్ళి, జరిగిన దంతా మంత్రి గారికి చెప్పి, మంత్రి గారి విషయంలో తాను చేసిన తప్పిదమును మన్నించమని వినమ్రుడై నమస్కరించాడు సంస్కారవంతుడైన ప్రభువు.

'మహాప్రభూ! మీరు పెద్దలు. శ్రేష్ఠులు. భూపతులు. మీరు నన్ను క్షమించమని అడగ కూడదు. మీరు నన్ను కారాగృహంలో ఉంచడం కూడా మన మంచికే' అన్నారు మంత్రి గారు. ఈ వాక్యము రాజు గారికి మ్రింగుడు పడలేదు. ఇదేమిటి! ఏదో ఊతపదము లాగా, ప్రతి దానికి 'అంతా మన మంచికే' అనడము ఈ మంత్రి గారికి అలవాటుగా మారి పోయిందా? అని సంశయిస్తూ, 'అదేమిటి మంత్రి గారూ! నేను చేసిన పొరపాటును కూడా మీరు అంతా మన మంచికే అంటున్నారు?' అని తిరిగి ప్రశ్నించారు రాజు గారు.



అప్పుడు మంత్రి గారు సమాధాన మిస్తూ, 'ప్రభూ! నిజంగా ఇది మన మంచికే జరిగింది. మీరు ధర్మ ప్రభువులు. ధర్మ పాలనతో ప్రజలను కన్నబిడ్డల లాగా పోషిస్తున్నారు. మీ లాంటి ధర్మమూర్తుల ద్వారా నన్ను రక్షించాలని పరమేశ్వరుడు భావించడం వల్లనే మీ చేత శిక్ష వేయించి నన్ను కారాగృహంలో ఉంచి కాపాడాడు.

'ప్రభూ! నేను కారాగృహంలో కాకుండా, రాజ మందిరము లోనే ఉన్నట్లైతే, నేను లేకుండా మీరు వేటకు వెళ్ళే వారేనా? నన్ను కూడా వెంట పెట్టుకొని వెళ్ళేవారు. మీతో పాటే నన్ను కూడా దొంగలు అపహరించే వారు. మీకు అంగవైకల్యం ఉందని గ్రహించి మిమ్మల్ని వదిలేసిన దుండగులు ఏ వైకల్యము లేని నన్ను విడిచి పెట్టేవారా? తప్పక నన్ను బలి ఇచ్చేవారు. ఆ దారుణ హింసాకాండను చూచి మీరు ఎంత బాధ పడేవారో! మీరు నన్ను కారాగృహంలో ఉంచడం వల్ల, నేను ఆ ప్రమాదము నుండి తప్పించుకొని, మీ లాంటి ధర్మ ప్రభువుల సన్నిధిలో మరి కొంత కాలము సేవ చేసుకొనే భాగ్యానికి నోచు కున్నాను. ఇదంతా జరిగింది మన మంచికే కదా ప్రభూ!' అన్నారు మంత్రి గారు. రాజు గారితో సహ అందరూ ఆశ్చర్య పోయారు. చూశారా! ఇదే సమభావము. ఇక్కడే ఉంది శరణాగతి. ఈ విధంగా కర్మయోగము మనల్ని ఉన్నత శిఖరాల వైపు నడిపిస్తుంది.

## రాదగిందే వస్తుంది

ఏది మనకు సిద్ధించినా రాదగింది కనుకనే వచ్చింది. ప్రయత్నించినా ఏదైనా సిద్ధించ లేదంటే, అది మనకు అవసరం లేనిది అని మనం అర్థం చేసుకోవాలి. కనుక ఈశ్వర ప్రీత్యర్థం కర్మలను ఆచరించడము, ఫలితాలను భగవ త్ప్రసాదంగా స్వీకరించడము - ఇదే మనం అలవరచుకోవాలి.

ఇదే జరిగితే, మన జీవితాలలో దుఃఖం దగ్గరకు రాదు. నవ్వులు దూరం కావు. ఏది జరిగినా, మనలోని ప్రశాంతత చెదిరిపోదు. అత్యంత ఆప్తులు రాలి పోయినా, మన బుద్ధి లోని ప్రశాంతత కారిపోదు. ఎందుకని? రాలిపోవలసిన వారే ఈ లోకంలో అడుగు పెడతారు. రాలి పోవలసిన వారే రాలి పోతారు. మార్పు చేయలేని విషయంలో అంగీకరించడమే కర్తవ్యం. అదే కర్మయోగ మార్గము.

రాలి పోయే వాటి కొరకు విలపించడానికి మనం రాలి పోకుండా ఉంటామా? ఎవరూ స్థిరం కానపుడు ఎవరు ఎవరి కొరకు దుఃఖించాలి? సత్యం అర్థం కానందుకు దుఃఖించా లేమో! వాస్తవాలు బుద్ధికి పడితే విలాపాలు దరి చేరవు. బుద్ధి వికాసం తోనే ఉంటుంది. బ్రతుకు నవ్వుల లోనే తేలిపోతూ ఉంటుంది.

కనుక, ఈ ప్రపంచంలో మనం జీవించే మూడు రోజులు మన వల్ల ఎవ్వరికీ బాధ కలగకుండా, అలాగే, ఇతరుల వల్ల మనం బాధ పడకుండా, శాస్త్రం అందించే జీవన సత్యాలను బుద్ధిలో స్థిరంగా ఉంచుకొని, ఆవేదనలకు, అశాంతికి అందనంత దూరంలో సదా నవ్వుల పల్లకీలో ఊరేగుతూ, ఆనంద విహారము చేసేలా మీ జీవితాలను తీర్చి దిద్దే ప్రయత్నంలో భాగంగా, ఈ గురుపూర్ణిమ పర్వదినాన, నన్ను గురువుగా స్వీకరించిన మీకు నా బాధ్యతగా ఏదో చేయాలని సంకల్పించి, ఈ మూడు రోజుల కార్యక్రమంలో, 'నవ్వుతూ జీవించాలి' అనే శీర్షికను ఎన్నుకొని ప్రసంగాలు చేశాను.

చివరగా, ఒక్క విషయాన్ని మీకు హృదయంతో పలుకుతున్నాను. కాలం చాలా విలువైంది. దానిని సద్వినియోగం చేసుకోవాలి. కాలాన్ని వృథా చేసుకొనే వారు కాల గర్భంలో కలసి పోతారే గాని కాలాతీతులై శోభించ లేరు. వృథా అయిన క్షణాలు కోట్లు వెచ్చించినా తిరిగి రావు. చేయ దగిన కార్యాన్ని చేయవలసిన సమయంలో చేయక పోతే, మిగిలిన సమయాలు నవ్వడానికి ఉపకరించవు. శోకించడానికే సరిపోతాయి. అర్థం చేసుకోండి.

**తృణ స్వీకరణ కాలే రోమన్థం కుర్వన్ పశురివ, పశ్చాత్ అనర్థం మా భజ!**

పశువుల్ని మేపడానికి కాపరికి ఒక సమయం ఉంటుంది. ఆ సమయంలో తృణ పూర్ణ ప్రదేశాలకు పశువులను తీసుకొని వెళ్ళి, వాటిని అక్కడ విడిచి పెట్టి కాపరి అక్కడే ఉంటాడు. వచ్చిన పనిని విస్మరించి, గడ్డి మేయ వలసిన సమయంలో మేయకుండా, ఒక గోవు మేసిన గడ్డినే నెమరు వేస్తూ కూర్చున్న దనుకోండి! ఆరగించాల్సిన సమయాన్ని నెమరు వేసుకోవడానికి వినియోగిస్తే, కాపరి దానిని పశువుల శాలకు తోలుకొని వచ్చి కట్టేసిన తరువాత, 'అయ్యో! తృణాన్ని స్వీకరించలేక పోయానే' అని గోవు చింతిస్తే ఒరిగే దేముంటుంది? మనిషి జీవితం కూడా అంతే.

కనుక, కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి. ఎక్కడెక్కడ, ఎప్పుడెప్పుడు మీకు సమయం దొరికితే, దానిని సాధనగా మార్చు కొనేందుకు ప్రయత్నించండి. ఇది చాలా ప్రధానమైన విషయం.

కర్మలు ఎప్పుడూ ఉండవు. కర్మలు లేని సమయంలో మనం ఏమి చేస్తున్నాము? ఎప్పుడైనా ఆలోచన చేశారా? ఏవేవో ఆలోచనలు చేస్తూ కూర్చుంటాము. ఎక్కువగా, జరిగి పోయిన విషయాలను గూర్చే ఆలోచిస్తూ ఉంటాము.

జరిగి పోయిందంతా గతం. అది గతించి పోయింది. మనం ఆలోచించినంత మాత్రాన గతం తిరిగి చిగురిస్తుందా చెప్పండి? లేదు, జరుగబోయే విషయాల్ని గూర్చి ఆలోచిస్తాము. అంటే, భవిష్యత్తుకు సంబంధించిన ఆలోచనలు చేస్తాము అంటారా? చేయండి. తప్పు లేదు. కాకపోతే, భవిష్యత్తు మన చేతిలో ఉందా? మన ఊహలకు



అందుతుందా? వచ్చేవి వద్దన్నా వస్తాయి. పోయేవి వద్దన్నా పోతాయి. రానివి రమ్మన్నా రావు. ఎందు కొచ్చిన ఆయాసం ఇదంతా? ఆలోచించండి.

కనుక, గతాన్ని గూర్చి పరితపించ వలసిన అగత్యం లేదు. భవిష్యత్తును గూర్చి ఆందోళన చెంద వలసిన పరిస్థితి కూడా లేదు. ఇక మిగిలింది వర్తమానం. ఈ వర్తమానాన్ని ఎలా సద్వినియోగం చేసుకోవాలో తెలిసి వినియోగించుకోమని మీకు తెలియ చేయడమే గురుపూర్ణిమ నాడు నా నుండి మీకు అందుతున్న వర్తమానం.

ఆత్మబంధువులారా! సమయం లభించినప్పుడల్లా మీరు శ్రవణం చేసిన శాస్త్ర విషయాలను మననం చేసుకుంటూ ఉండండి. కొంత సమయం నామస్మరణం చేసుకోండి. కొంతసేపు జపం చేసుకోండి. ఇప్పుడు జపసాధనను గురించి కూడా మీకు చెబుతాను. శ్రద్ధగా ఆలకించి, అర్థం చేసుకొని, సమయం దొరికి నప్పుడల్లా, మంత్ర జపంలో, లేదా నామ జపంలో కాలాన్ని సద్వినియోగం చేసుకోండి. *

ఆత్మబంధువులారా! గురుబిడ్డలారా! ఈ విధంగా ఖాళీ సమయాలలో ఏవేవో మనస్సు లోకి తెచ్చుకుంటూ, ఎవరెవరినో మనస్సులో ఊహించుకుంటూ, బ్రతుకును నిస్సారంగా, నిర్వీర్యంగా మార్చుకొని వృథ చెందడం కాకుండా, సమయం దొరికి నప్పుడల్లా, విచారము ద్వారా గాని, నామము ద్వారా గాని, మంత్రము ద్వారా గాని, సంకీర్తనము ద్వారా గాని, స్వాధ్యాయము ద్వారా గాని భగవంతుని హృత్పూర్వకంగా తలచి, ప్రేమతో పిలిచి, మనస్సులో నింపుకొని, భక్తితో ఆరాధించడానికి అలవాటు పడితే, మన బ్రతుకులలో ఇక నవ్వులు దూరం కానే కావు. ఇది నా మాట. మీకు నా మనసైన మాట. నేను మీకిస్తున్న మాట.

ఇలా మంగళకరంగా జీవనయాత్రను మనం సాగిస్తూ ఉంటే, మార్గం లోనే, ఎక్కడో, ఎప్పుడో, ఎలాగో మీరు ఒక దివ్యానుభూతిలో ఉక్కిరి బిక్కిరి అవుతారు. అది మీరు ఆశిస్తే వచ్చేది కాదు. మీ సాధనల ఫలంగా మీరు ఊహించకుండానే మీకు ప్రాప్తించే వరం.

అదొక కదలిక. అదొక చలనం. అదొక సంచలనం. అదే బ్రతుకు పండే కాలం. అదే నవ్వులు చెరగని సమయం. అదొక అనుభూతి. ఒక దివ్యానుభూతి.

కృష్ణుణ్ణి పట్టుకుంటానని ప్రగల్భాలు పలికానే, అది నాకు సాధ్య మవుతుందా? కృష్ణయ్యను నేను పట్టుకో గలనా? అని ఒక గోపిక నంద గోకులంలో విలపిస్తూ ఉంటే, తన కోసం విలపిస్తున్న గోపిక విలాపాన్ని చూడలేక మన కన్నయ్య దొరికి పోయిన సన్నివేశాన్ని నా నుండి మీరు వినలేదా? కృష్ణుడు కదిలితేనే కదా, గోపిక పట్టుకో గలిగింది. మరి, మనం కన్నయ్యను కదిలించ లేమా? మన భక్తితో ఆయన హృదయాన్ని కరిగించ లేమా? అదే జరిగితే, కన్నయ్యను మనం పొందే దేమిటి? గోపికకు తనను తాను ఇచ్చుకున్నట్లు, మనకు కూడా ఆయన దొరికి పోతాడు. ఈ సత్యాన్ని మైస్టర్ ఎక్హార్ట్ ఎంత హృద్యంగా పలికాడో చూడండి.

---

* ఈ సందర్భముగా 'జపసాధన'ను గురించి, జపం చేసే విధానమును గురించి పూజ్య స్వామీజీ ఇరవై నిముషాలు వెచ్చించి, ప్రదర్శిస్తూ ప్రవచించారు.

Suppose a man in hiding and he stirs;
He shows his whereabouts thereby ;
And God does the same.
No one could have ever found God ;
He gives Himself away.

*'ఒకవేళ దాగి ఉన్న మనిషి కొద్దిగా కదిలాడా, అతని ఉనికిని అతనే తెలుపు కుంటాడు.*
*భగవంతుడు ఇలాగే చేస్తాడు.*
*ఇంతవరకు భగవంతుణ్ణి చూచిన వారు లేరు.*
*ఆయన తనకు తానుగా కనిపించి నపుడే దర్శించ గలిగారు;* అన్నాడు ఎక్కార్ట్. ఇదొక అందమైన భావన.

కేవలం మంజులమైన భావనలే గాకుండా, ప్రామాణికమైన ఆత్మవిద్యను అనుగ్రహించిన మహర్షుల, మహాగురువుల సంతతి మనం. మన గురువుల ప్రబోధాలు మనకు ఉన్నాయి. వారి ఆశీర్వాద బలం మనకు ఉంది. రేపు గురుపూర్ణిమ పర్వదినాన్ని జరుపుకుంటాం. మన గురువులు చూపిన మార్గంలో చరించి, బ్రతుకును సఫలం చేసుకుంటామని రేపు మీ మాటను వారికి మీ మనస్సు లోనే వినిపించండి.

**కర్ణధారం గురుం ప్రాప్య**
**తద్వాక్యం బలవత్ దృఢమ్**
**అభ్యాస వాసనా శక్త్యా**
**తరంతి భవ సాగరమ్ ॥**

కుశలుడైన కైవర్తకుడు గురువు ఉన్నాడు. ఆయన దివ్యవాణి అనే బలమైన నావ ఉంది. అభ్యాస వాసనా బలము చేత, ప్రయాణమును సాగించి, భవ సాగరమును దాటి తరించెదము గాక!

ఓం . . . ఓం . . . ఓం . . .



మిత్రులందరికి విన్నపము మేము చేస్తున్న భక్త ప్రచారం ఈ web sights ద్వారా చేస్తున్నాము
www.telugudevotionalswaranjali.blogspot.in
www.gitamakarandam.blogspot.in
www.sundaravignanagrandalayam.blogspot.in
www.hindudevotionalswaranjali.blogspot.in
OUR VIDEO CHANNELS: www.youtube.com/ysreddy94hyd
www.youtube.com/user/hindudevotionalo
www.youtube.com/user/Shruthimandiramu
PDF BOOKS CHANNEL: www.scribd.com/ysreddy94hyd
E mail ID: ysreddy94hyd@gmail.com
our mediafire folderlinks
www.mediafire.com/?86epi81waeayl
www.mediafire.com/?7900suod857zc
www.mediafire.com/?45h5fdfw4igzi
www.mediafire.com/?606gdhk35zvbc
www.mediafire.com/?ot92f0wb91g18
www.mediafire.com/?xw75pfuld2dyy
our uploaded folder links:
www.4shared.com/account/dir/7389418/29f7347/sharing.html
www.4shared.com/account/dir/17611451/d787ef46/sharing.html
www.4shared.com/account/dir/10277723/80937010/sharing.html
www.4shared.com/account/dir/8542654/5e21d7f2/sharing.html
www.4shared.com/account/dir/13927785/d05881/sharing.html
www.4shared.com/account/dir/7389329/5bfa0697/sharing.html
www.4shared.com/account/dir/oR3TndoY/sharing.html
www.4shared.com/dir/F2rw-Nf_/sharing.html
www.4shared.com/account/dir/WNtoWpN7/sharing.html
www.4shared.com/account/dir/nxtsJpm4/sharing.html
www.4shared.com/dir/gaxNSDyA/sharing.html
www.4shared.com/account/dir/oR3TndoY/sharing.html
www.4shared.com/dir/F2rw-Nf_/sharing.html
www.4shared.com/dir/yEUzuoce/sharing.html
www.4shared.com/dir/ntqVRt35/sharing.html
www.4shared.com/dir/aEQCrlBZ/sharing.html